# తపతీసంవరణము

## ఆఱంకముల నాటకము

ఇది

కాకర్ల కోండలరావుచే

ఆంధ్రీకరింపబడినది.

పబ్లిషర్సు:

మారుతీరాం అండ్ కో.,

బుక్కుసెల్లర్సు,

బెజవాడ, కృష్ణాజిల్లా.

రెండవకూర్పు: 10( ప్రతులు.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

డీ. కే. పంత్ చే

ముద్రింపబడినది.

1923

All rights reserved]. [Price Re. 1-0-0.

గీ. ధర భరద్వాజ మౌని గోత్ర ప్రభువుఁడు
ప్రియ గుణుఁడగు కే. యర్. కేసరికి నొసంగు
నాయురారోగ్య విభవంబు లలఘుగతిని
ఆశ్రితావనమూర్తి నారాయణుండు.

# ఇందువచ్చు పాత్రలు

సంవరణుడు - కథానాయకుడు.

విదూషకుడు - రాజు వేడుక చెలికాడు.

వసుమిత్రుడు - మంత్రి.

వసిష్ఠుడు - పురోహితుడు.

కుశుడు - రాజకుమారుడు,

కంచుకి - అంతఃపుర పరిచారకుడు.

తాపసుడు - భృగుమహర్షి శిష్యుడు.

## స్త్రీలు

తపతి - కథానాయిక

రంభా<br>మేనకలు } చెలులు

ఇద్దఱు చేటులు.

# కథాసారము

## —* ప్రథమాంకము *—

హస్తిపురాధీశ్వరుఁడగు సంవరణ చక్రవర్తి యీ కథకు నాయకుఁడు. ఆతఁడు దనతొలి భార్యయగు సాల్వరాజ పుత్రియందు సంతానము గానక, యామెనొక వ్రతనియమమున నుద్యానమున నుంచును. అంతఁ గలలో నాతని కొక రేయి, సూర్యుఁడగపడి, యెన్ని వ్రతములు గావించినను సాల్వరాజు పుత్రియందు సంతానప్రాప్తి లేదని యానతిచ్చెను. ఆ యుదయముననే దేవిని వ్రతము మాన్పించి, విదూషకునితోఁ గూడి తానుద్యానమున విహరింపఁబోవును వారికచ్చట నొక మరకత శిలాతలముపైఁ గొన్ని యడుగుజాడ లగపడుటయు, పిదపఁ బైనుండి యొకకర్ణపూరము రాలుటయు, గని, యచ్చటికి దేవ కామిను లెవ్వరో వచ్చియుండురని కొన్ని గురుతులచే రాజుకనిపెట్టి మన్మథ పరితాపమున కగ్గమగును.

## —* ద్వితీయాంకము. *—

రంభామేనకలు, సూర్యపుత్రియుఁ దమకు యజమానురాలునగు తపతి యను కన్నెంగూర్చి ముచ్చటించుకొనుచుఁ, తపతి నారదునిచే సంవరణుని రూప శౌర్యగుణములను విని యాతనిపై బద్ధానురాగయయ్యు, యాతనిఁ జూడఁ గోరి మేనకతోఁ గలిసి, సంవరణుని యుద్యానమునకు వచ్చుటయు, అపుడు మేనక తపతి కర్ణపూరమున మన్మథగాథాక్షరములు కొన్ని లిఖించి యాతని ముందు వైచుటయు, మున్నగు కథాభాగమును వెల్లడింతురు.

పిదప రాజు వేటకై హిమవత్పర్వత కాననమ్ముల కేగును. తపతియు నచ్చట నొకశిలామండపమున సంవరణునిఁ గూర్చి పరితపించుచుండును. రాజు ప్రక్కనుండి విని సంతసిల్లును.

సూర్యాస్తమయమగుటచే నందఱు నిష్క్రమింతురు.

## —* తృతీయాంకము. *—

రాజేంద్రుఁడా మండపమునసే తపతికై పరితపించుచు విమానమునిచే శిశిరోపచారములందుచు పరితాపభరంబునఁ దుదకు మూర్ఛిల్లెను. తపతికూరము నుండి యిదంతయును జూచుచుండి, పరుగునవచ్చి, రాజును స్పృశింప నాతఁడు మూర్ఛదేరి, యావెంబట్టుకొనఁబోన సఖులడ్డమై, సూర్యునారాధించి యావెంబడనుమని తపతితో నంతర్ధానమందుదురు. రాజున్నట్లేకాంచి, తపతిం బెండ్లాడి సుఖంబున నాయరణ్యమునసే కాలము గడపుచుండును.

## —* చతుర్థాంకము. *—

పూర్వమొక యుద్ధమున సంవరణునిచేఁ దనపుత్రుల నాప్వరను గోల్పోయిన యొక రాక్షసి మోహినికయనునది, మాయలచే రాజుల నెట్లు యినఁ జంపి పగదీర్చికొనఁగోరి, యొక కుట్రబన్ని రాజునంగీకారము వడసి యొక విమానమున సాయంతనవేళ నాతనిఁ గొంపోవునట్లు, నియమించికొని పోవును. భృగుమహర్షి యావిషయము లెఱింగి తన మంత్రప్రభావంబున నా రాక్షసిని దూరముగఁదోలి, రాజునకా కుట్ర యెఱింగించి, ఋషికుల శరణ్యుఁడగు నారాజచంద్రునిఁ గాపాడును.

## —* పంచమాంకము. *—

రాజు చిరకాలము లేనందున నరాజకమయి సంవరణు రాజ్యమంతయు, దుర్భిక్షపీడితమై, రిపుజనమ్ముల కగ్గము గానున్నతరిని, మంత్రి మిక్కిలి యుఁ జింతించి సంవరణుని వెదకికొనుచు, నరణ్యములకు వచ్చును సంవరణుఁడు దపతియందలి యనురాగముచే పురికేఁగ నిచ్ఛగింపకున్నాఁడని గ్రహించి, వారికిద్దరకెట్లయిన యెడబాటు గల్పింపనెంచి, యొకరేయి వారిద్దరు నిద్రించుతరిని, సారథి రహస్యముగ గర్భవతియగు తపతిని యావెయక్కయగు సావిత్రికడకుఁ జేర్పించును. అంత తపతి యచ్చట సూర్యకల్పిత సమ్మోహమ్మున నొడలెఱుంగకయే పుత్రునిఁ బ్రసవించెను. సూర్యుఁడా కొమరు

వెంటనే తనలోకమునకుఁ గొంపోయి పెంచుచుండెను. ఇచ్చట సంవరణుడు తపతింగానక యున్మత్తుఁడై కాననముల గ్రుమ్మరువేళ సమయము కనిపెట్టి మంత్రివిదూషకు లిరువురును సమీపించి, శత్రువుల దుండగముల నుగ్గడించి యాతనికిఁ గోపముం బుట్టించి, సూర్యదత్తమగు రథమున నాకాశవీథిని పురంబునకుఁ గొంపోవుదురు.

## —* షష్ఠాంకము. *—

రాజు, శాత్రవుల జయించి- ప్రజల కష్టములడంచి, సుఖించుచుండీ, తపతిం దలఁచి పరితపించుచుండ, నచ్చట దపతియుఁ రాజునకయి పరితపించుచు, తనయాజ్ఞలేనిదే పతిని దర్శింపరాదనిన జనకుని శాసనమున సేయునదిలేక మారువేసమున సౌధాగ్రముననున్న రాజుకడకు వచ్చును. అంత మరల మోహినిక కొన్ని కుట్రలు కల్పించి, వారినెల్ల నేకకాలమున నంత మొందించు సమయమున సూర్యలోకమునుండి సంవరణ పుత్రుఁడగు కురునితోఁగూడ వసిష్ఠుడరుదెంచి, కుమారు నర్పించి, మోహినిక మాయలన్నియు వెల్లడించి, కుమార బంధితయైన మోహినికనువిడిపించును. ఇంతలో తపతియు రాజును నొండొరుల గలసియుండునట్లు సూర్యుఁడు మరల ననుగ్రహించి పారితోషికము వస్త్రాభరణములుఁ బుత్తెంచును. అందరుఁగలసి సుఖింతురు. ఈ కథ భారతము నాది పర్వములోనిది. ఈ నాటకమున ననతి మార్పులొందినది.

---

# పీఠిక.

నేను 1917 సంవత్సరము సెప్టెంబరు నెలయందుఁ గర్నూలు పురంబున కొక పనిమీఁదఁ బోయియుంటిని. అచ్చట బ్రహ్మశ్రీ ఇంద్రగంటి సుబ్రహ్మణ్యశాస్త్రి గారికిని నాకును నూతనముగ మైత్రిసంప్రాప్తమయ్యె. పిమ్మట వా రొకనాఁడు గీర్వాణవాణి నున్న తపతీసంవరణనాటకము నాకుఁ జూపి దాని నాంధ్రీకరించుటకు నన్నుఁ బ్రోత్సాహ పరచిరి. అంతట నే నాపనికిఁ గడంగి యచ్చట నే సుమా రిరువది రోజులలోఁ బ్రథమాంకము ముగించితిని. అనంతరము ప్రస్తుతము నాకునివాసభూమియగు కృష్ణామండలము నందలి కోవూరునకేఁగి యచ్చట నా ప్రాణసఖుఁడు జాజాల చలమయ్యశాస్త్రి నాక నేక విధముల సహాయమొసఁగి నన్నుఁబ్రోత్సాహపఱుప 1918 సంవత్సరము జనవరి నెల నాటికి గ్రంథమంతయుఁ బూర్ణముగ నాంధ్రీకరించితిని. జూలై నెలలో నాంగ్లవిద్యాభ్యాసమునకై నేను చెన్నపురికి వచ్చితిని. అప్పుడు నా మిత్రు లనేకు లీగ్రంథముం జూచి చాల బాగుగ నున్నదని ప్రశంసించి ముద్రణమునకై నన్నుఁ బ్రేరేపించిరి. కాని నాకిది ప్రథమప్రయత్న మగుటంజేసి దోషయుక్తమై యుండు నని యెంచి యింత శీఘ్రకాలమున ముద్రింపించుట కిష్ట పడకుంటిని. అనంతరము నేనీ పొత్తమును గొందఱు పండితులకుఁ జూపఁగా వారు మంచి అభిప్రాయముల నిచ్చిరి. అంత నేనీపొత్తమును ముద్రింపఁ దలంచి యుండ, డాక్టర్. కే. యన్. కేసరిగారు నా యుద్యమమునకుం దోడ్పడి ముద్రణమున కగు వ్యయము లన్నియుఁ భరించి నాకృతజ్ఞతకుం బాత్రులైరి. వేమూరి రామదాసు పంతులుగారు, ఆంధ్రపత్రికా సంపాదకులగు నాగేశ్వరరావు పంతులుగారు, బచ్చు వేంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారును, సామి వేంకటాచలము శ్రేష్ఠిగారును వలయు కాగితముల నిప్పించి నన్ను సఫలమనోరథుని గావించి నందులకు వారికెంతయుఁ గృతజ్ఞుఁడను. గ్రంథరచన యందు నాకుఁ జాల తోడయి ముద్రణమునకు నన్ను మిక్కిలిప్రేరేపించి నా మిత్రులు కేసరి, గురుమూర్తిశాస్త్రియు, బులుగుండ్ల నరసింహశాస్త్రియు నాకృతజ్ఞతకుఁ బాల్పడిరి. అచ్చటచ్చట నచ్చుతప్పు లుండవచ్చును. కాన రెండవ కూర్పున సవరించికొనెదను.

పండితులు మన్నింపఁ బ్రార్థితులు.

ఇట్లు,

23 జనవరి 1919.

కాకర్ల కొండలరావు.

# అభిప్రాయములు.

---

బ్ర॥ శ్రీ॥ కాకర్ల కొండలరాయఁడు రచించిన "తపతీసంవరణ" మను నాంధ్రీకృత నాటకము నందుఁ బఠించితిని. మిక్కిలి చక్కఁగాఁ దెనిగింపఁ బడినది. శైలి మనోహరమై పండిత పామర హృదయాహ్లాద కరమైయున్నది భావ నిర్దుష్టమై శ్లాఘ్యమైయున్నది. ఇదియే వీరికిఁ బ్రథమ ప్రయత్న మని కవిత్వమొక్కొక్కచోఁ దెలుపుచున్నది. సమష్టిమీఁద ధార యనర్గళమై స్వతంత్రముగ రచితమైన గ్రంథమువలెఁ పఠనీయమై యున్నది. వీరీ కవిత్వశిల్పమున నింకయు శ్రద్ధాభక్తులతోఁ బాటుపడెదరేని యుత్తమ కవులలోఁ జేరఁగలవా రగుదురు.

తిరువళిక్కేణి<br>25—1—19 } వావిలికొలను-సుబ్బరావు.

---

మ॥ రా॥ రా॥ కాకర్ల కొండలరావుగారిచే నాంధ్రీకరించబడిన "తపతీసంవరణ" మను నాటక మంతయు నేను వింటిని. కొన్ని పద్యములును గద్యములును మూలముతోఁ బోల్చి జూచితిని. మూల మందలి యర్థమును, భావములును, భాషాంతరము నందుఁ జక్కఁగ బ్రతిఫలించినవి. మూలముతో సంబంధము లేకుండఁ జూచినను నాటకము ప్రదర్శనయోగ్యమనియుఁ బ్రేక్షకులకుఁ దప్పక యాహ్లాదముఁ గల్పించు నది యనియు నాయభిప్రాయము. ఈ గ్రంథకర్త భాషాసేవ యీవిధముగనే చేయుచుండినయెడలఁ గొలది కాలమునందే మంచికవి యనియు నాటకకర్తయనియుఁ బేరుపొంద వచ్చును.

కే. వి లక్ష్మణరావు,<br>ఆంధ్రపత్రికానిలయము.

---

మ॥ కొండలరావుగారు వ్రాసిన తపతీసంవరణనాటకమును నేను కడు సంతసముతో తీరనితనివితో వదలజాలని కుతూహలముతో తదేకలగ్నమగు మానసముతోఁ జదివితిని. వీరి కవిత్వము మృదుమధురము. పద్యముల నడక ధాటి శ్లాఘనీయము. గీర్వాణభాషను రచించిన ప్రాచీనకవి హృదయమును వు తమయాంధ్రీకరణమునఁ జక్కఁగాఁ జూపఁగలిగిరి. ఇట్టి ప్రశస్తమగు

నాటకమును ఆంధ్రవాఙ్మయమునకుఁ గానుకగా నిడిన కొండలరావుగా రాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులు.

వేమురుమూడి - శేషగిరిరావు.

సహాయసంపాదకుఁడు.

నీతిదాయకమై పదలంకార భూయిష్ఠమై సముచితపోషణా సంవిధానముచే నొప్పారునట్టి తపతీసంవరణ నాటకమును మహారాజశ్రీ కాకర్ల కొండలరాయ కవిగారు సంస్కృతమునుండి యర్థశ వాగ్ధాటితో మృదుమధుర శైలితో సలక్షణభాషతో నాంధ్రీకరించి యాంధ్రభాషామతల్లి కొక యమూల్యాభరణమును గానుకగా నొసంగిరి.

వీరికిదియే ప్రథమప్రయత్నమైనను మూలమునందలి భావాదిస్వారస్యాదుల నించుకేనియు వెలితిబడనీయక స్వతంత్రగ్రంథపంక్తి ననుసరించి యున్నది యున్నట్లింత మనోజ్ఞముగాఁ దెనిగించుటఁజూడ వీరిభాషాపరిశ్రమమును గవిత్వతత్త్వనైపుణ్యము పాండిత్యము వెల్లడియగుచున్నది.

ఈ గ్రంథము చేతఁగీసికొనినచోఁ దుదవరకుఁ జదువనిదే మనసున కింపొనర్పదు. మఱియుఁ గదళీపాక విరాజితమై దనరారుటచే విద్వాంసులకు సామాన్యులకును నిరతిశయానందమును సమకూర్చుచు నున్నతభావ ప్రబోధకమై సంస్తుతిపాత్రమగుచున్నది.

ఈ గ్రంథము మూలమునందలి భావాదుల నించుకేనియు వెలితిబడకుండ స్వతంత్ర గ్రంథముగా నుండునట్లు మిక్కిలి రమణీయముగా రచియింపబడియుండుటచేఁ జదువరుల మనము నెంతయు నాకర్షించుచు వారినున్నతభావ ప్రబోధితులఁ గావించి మనసున కొక యపూర్వానందమును జనింపఁజేయుచున్నది. ఈగ్రంథకర్త కిదియే ప్రథమ ప్రయత్నమైనను భాషాంతరీకరణములలో నింత హృదయంగమముగా మనోజ్ఞముగా నిర్మింప సామర్థ్యము గలవారు మనదేశమున నరుదుగా గన్పించుచున్నారు. ఇట్టి రూపకములను జ్ఞానమార్జించుటయం దాసక్తిగల వారెల్లరుఁ జదివినచోఁ దదుపలబ్ధికి సందియ ముండదు. మన దేశమునందలి కవులలోఁ బ్రాముఖ్యము వహింపఁగల శ్రీ కొండలరాయ కవిగారికి నా పరమదయాళుఁడగు నీశ్వరుడాయురారోగ్యైశ్వర్యముల నొసఁగి వారిచే నిట్టి భాషాసేవ నిరంతరముఁ జేయఁబడు నట్లనుగ్రహించుఁగాత!

భిషగ్వర - కైప సుబ్రహ్మణ్యశర్మ.

ఓం

# తపతీసంవరణము.

## ప్రథమాంకము.

{ నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించు చున్నాఁడు. }

సూత్ర—

చ. కలువలఱేనివంకయును గౌస్తుభముఁ సుధయుం గ్రమంబుమై
నలికము మోవి స్వేదమను వ్యాజమునం దమసోదరిఁ దదం
గలతిక నూని పెండ్లితరిఁ గాంతుని కీయఁగ, దెచ్చిరో యనం
బొలుచు సుధాబ్ధికన్యపరిపూర్ణకృపామతి మిమ్ముఁ బ్రోచుతఁ

(ఆలోచించి) అతివిస్తర మేల? నా కిపుడు సంప్రాప్త మైనయభ్యుదయ ప్రమోదాతిభారంబున మద్గృహిణియుం బాల్గొనుఁగాక. (తెరవంక జూచి) నటీ! యిటురమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యా! యిదిగో! వచ్చితిని.

సూత్ర—ప్రియా! అపూర్వంబు నాదిరాజకథాసనాథంబును నగు తపతీ సంవరణ నాటకమందలి ప్రయోగామృతాంతరములగునవరసంబులనుఁ బానము జేయఁగోరి యీ యార్యమిశ్రు లట్టియుచితప్రయోగంబునకు నన్ను నియోగించి యున్నారు.

నటి—ఆర్యా! యీనాటక మే కవిపుంగవునిచే రచియింపఁ బడియె?

సూత్ర—ఏని మకుటతటము పరమహంస పాదపంకేరుహపాంసుపటలపవిత్రీకృతమైనదో యేనికరకమలము గోత్రామరేంద్రదారిద్ర్యాంధకారంబునకు భానుతుల్యమైనదో యేనిముఖకమలమునుండి యాశ్చర్యమంజరీకథామధుద్రవము చిప్పిలినదో మఱియు

గీ. ఉన్నతాంస మాజానుబా ♦ హుయుగ మాంస
వర్ధిరత్నకర్ణికకర్ణ ♦ పాశ మూరుశి
రోధి యుత్తుంగఘోణము ♦ రుక్మనిభము
నైన యొప్పానితనువు ప్ర ♦ జార్తిహారము

అట్టి కేరళకులచూడామణియు మహోదయపురాధీశ్వరుఁడు నగుమహాకవి "శ్రీకులశేఖరవర్మ" ధరావల్లభుండు తొలుత గీర్వాణభాషయం దీనాటకమును రచించెను.

నటి—అట్లయిన దీని నెవరాంధ్రీకరించిరి?

సూత్ర—

సీ. ఆత్రేయగోత్రాంకుఁ ♦ డాఱువేలనియోగి
వంశసంజనితుఁడై ♦ పఱలువాఁడు
సతతంబు ఋజుమార్గ ♦ చరుఁడైననిమ్మరా
ట్చిన్నాంబికలు ♦ కూర్మిచిన్నిసుతుఁడు
సద్గుణి జాజాల ♦ చలమయ్యశాస్త్రికి
ననయంబు విడరాని ♦ ప్రాణసఖుఁడు
బాల్యంబు గడచిపో ♦ వ వినూత్నతరుణిమ
బైకొనం దనరారు ♦ వటువువాడు

గీ. నిరతమును దైవభక్తిమైఁ ♦ బరగువాడు
పండితులమ్రోల నాదల ♦ వంచువాఁడు

జాలిగలవాఁడు సజ్జన ♦ సమ్మతుండు
ప్రకటధీశాలి కొండలరాయఁ డతఁడు! 3

నటి—ఆర్యా! అనపత్యుల రగువిూఁద సపత్న్యుత్పత్తిహేతువగు వివాహాంతరాభ్యుదయమున జనించిన యానందము నేఁడీ యార్యమిశ్రుల యాజ్ఞాబలముచే ద్విగుణిత మైనది.

సూత్ర—ఇఁక సంగీత మారంభింతమా ?

నటి—(ఖేద మభినయించి) ఆర్యా! నేనింతవఱకును పుత్రలాభము రాఁకచే నియమక్లేశితశరీర నగుటం జేసి గాన మొనర్ప జాలకున్నాను.

సూత్ర—(తెరవంకఁ జూచి) ఆహా! నా శిష్యుఁడు శివదాసు విదూషకుని వేషముఁ బూని యిటే వచ్చుచున్నాఁడు. నీవు బడలియున్న దానవు. నేనును శిష్యగుణసంక్రాంతమై యున్న యాత్మప్రయోగప్రతిబింబముం దిలకింప నుత్సాహినై యున్నాను. కావున మన మిరువురమును బ్రేక్షకుల మగుదము. మఱియును,

గీ. పుత్రలాభార్థముగ నీవు ♦ పూనియున్న
వ్రతము నందుండి నాచేని ♦ వారణంబు
వడసితివి; సంవరణ సార్వ ♦ భౌముచేత
సాల్వభూనాయకునితనూ ♦ జాత వోలె. 4

(ఇద్దఱును నిష్క్రమింతురు)

{ విహ్వలాంగుఁడై విదూషకుఁడు
ప్రవేశించుచున్నాఁడు. }

విదూ—(నిట్టూర్పు విడిచి యంగము లొత్తికొనుచు) దేవియగు సాల్వరాజపుత్రిని పుత్రీయానియమమునుండి నివారించి మరలి స్వప్నశ్రవణార్థమై శీఘ్రముగ రమ్మని కంచుకిచే చెలికాఁడు నా కీయుదయమున నే

చెప్పిపుచ్చెను. నేను నశ్వయానమునఁ బోయి నియోగము నెఱవేర్చికొని మరలి రాజవీధిని వచ్చుచు నా మొద్దుగుఱ్ఱము మీఁదనుండి తల్లక్రిందుగా బడితిని. అందుచే నా యవయవములు నాకు స్వాధీనము గాకున్నవి. కాని యైనను బలవంతమున నాచెలికానికడకు లాఁగికొని పోయెదనఁ గుంటుచు నుండుటకు జూచి) ఆహా! యేమి నాప్రభావము. ఈహా స్త్రీపురవాస్తవ్యులందఱును గుఱ్ఱము-పారాశర్యుఁడు- అని యస్పష్టాలాపము లాడుచు హాసనిరోధ దుష్ప్రేక్ష్యముఖులై నవ్వుటకుఁగాని నవ్వకుండుటకుఁగాని శక్తిలేక పర్యాకులచిత్తులై యున్నారు. (తెరవంకఁ జూచి) ఇదిగో! నాచెలికాఁడలంకరణము సమాప్తిఁజేసికొని యిటే వచ్చుచున్నాఁడు. ఇఁక నేను శ్రమపడ నేల? కావున నిచ్చటనే యుండెదను. (అచ్చటనే యుండును.)

{ రాజు సపరివారుఁడై మనస్తాపముతోఁ ప్రవేశించుచున్నాఁడు. }

రాజు—(సవిమర్శనముగా) ఆహా! అపత్యపదార్థవిశేషమహిమ చెప్పఁ దరము కాదు, ఏలయన,

గీ॥ ప్రసవగుణహీన యగునాదు ♦ భార్యఁ దలఁప
మది జనించెడి నెంతో యు ♦ మ్మలిక నాకె
కూర్మితనయులవిరహంబు ♦ కొలఁదిఁ బుత్ర
వంతుల కొదవుఖేదం ♦ బి కెంతయొకద! 5

స్వప్నము విని కర్తవ్య మాలోచించుటకై యిటకు రమ్మని యుదయముననే నాచెలికాఁడగుపారాశర్యునికి వార్త నంపియుంటిని. అతఁడిప్పటికిని రాకున్నవాఁడు (దిక్కులు బరికించి) ఓహో! ఏమిది, అప్పుడే లేయెండ తలయెత్తనుంకించుచున్నది.

సీ॥ కలకలారావముల్ ♦ జెలఁగఁ బక్షికులంబు
లాశాంతరంబుల ♦ కరుగఁజొచ్చె
వరివెన్నుతుదవోలె ♦ నరుణంబు లగుభాను
కిరణముల్ దిశలంటఁ ♦ గెరల కుండె
నిదురమత్తునఁ దేలు ♦ నేత్రాంబుజములకు
నల్ల నల్లన దృష్టు ♦ లావహించె
అంతకంతకుఁ జారి ♦ యతికృశత్వము నొంది
యిరుల మొత్తంబు లిం ♦ తింత లయ్యె
గీ॥ జరఠ మత్స్యాల్ప మగుతమ ♦ శ్శకల మొకటి
సాగరతరంగముపగిది ♦ సన్నగిలుచు
నపరదిశయందు లఘుభాగ ♦ మావరించి
పాసి పోఁజాల కున్న దిప్పటికి నైన. 6

(ముందునకుఁజూచి)

అహో! యీ నాచెలికాఁడు పారాశర్యుఁ డేలకో వ్యసనపీడితునింబోలె గన్పట్టుచున్నాఁడు. ఈతని యీయవస్థకుఁ గారణ మెద్దియో!

విదూ—(సమీపించి యెట్లోకుడిచేయి యెత్తి) మిత్రమా ! జయ మగు గాఁక

రాజు—వయస్యా! నీయవయవవ్యాపారము పూర్వమువలె లేదేమి ?

విదూ—తమయనుగ్రహమే కారణము.

రాజు—అనఁగా నీయభిప్రాయ మేమి ?

విదూ—(నవ్వుచు) అక్షరముచేతను యాకారముచేతను సూచింపఁ బడని విషయములనే యెఱింగి సదా వ్యవహరించుచుండు నీవు నే నిప్పు డక్షరాకారముల రెంటిచేతను సూచించినయీవిషయ మెఱుంగఁజాలకుంటివా? నీపాండిత్యమెక్కడ బోయినది ?

రాజు—సముద్రమునందువలె లోఁ దెలియంగరాని మీబోఁటివారి మనోవ్యాపారము తెలియంగుటకు మాబుద్ధు లల్పములు. కావున స్పష్టముగాఁ జెప్పుము.

విదూ—అట్లయినఁ జెప్పెదను వినుము. నే నశ్వయానమున దేవికడ కేఁగి నియమమునుండి యామెను నివారించి మరలి రాజవీధిని వచ్చునప్పు డా మొద్దుగుఱ్ఱము బంతివలె న న్నెగుఱవేసి యేమూలనో పడఁద్రోచి పోయెను. గుఱ్ఱపు మూఁపుపై నాసన మొకనిముసమాత్ర మైన నిలువ మింజేసి యీయశ్వారోహణముచే నే నాకాశగమన మర్థము మాత్రము నేర్చికొంటిని. దేవాసురవిమర్ద పరిచితాంబరగమనుఁడగుటఁజేసి నా చెలికాఁ డీ విద్య పూర్ణముగ నేర్పఁగలఁడు గదా యని నే నప్పు డనుకొని వెంటనే యిట కేతెంచితిని. కావున నాకిప్పు డావిద్య నుపదేశింపుము.

రాజు—మూర్ఖా! ఈవిషయమున మాయుపదేశములు నిరర్థకములు.

చ. అరుదగు యోగమార్గమున • నైనను మంత్రసుసిద్ధి నైనని
ర్జరులవరంబుచే నయిన • సంయమిచంద్రులసేవ నైన న
క్షురసుకృతార్జనారతులు • కల్మషరాశి నశింపఁ జేసి స
త్వరము నభస్థలీగమన • భాగ్యముఁ గాంచి సుఖింతు రెంతయుఁ॥

విదూ—పోనిమ్మా ప్రసంగము వదలుము. వాడియున్న నీమోముదామరం జూడ నీహృదయమున నేదో సంతాప మున్నట్లు తెలియుచున్నది. కారణ మేమి?

రాజు—మిత్రమా! చక్కఁగా నూహించితివి. గడచిన రాత్రి నేను స్వప్నమున సూర్యోపస్థాన మొనర్చుచుండఁగా,

చ. కరముల వేఁడిమిం దుహిన • కాండములన్నియు రూపుమాయఁ
దారువులఁ దమ్మితీవియలు • దోరగవిచ్చిన మొగ్గకన్నులం [గా

దిరముగ నల్లనై యెసఁగు ♦ తేఁటులపేరిక నీని కాళిచే
వెలుఁగునఁ జూచుచుండ రవి♦బింబము దోఁచెను మత్పురస్థలిన్॥

విదూ—తరువాత.

రాజు—అప్పుడు నేను భక్తిచే శిరసు వంచి నమస్కరించుచుండ నాబింబ మధ్యమునుండి యొకగంభీరవాక్కు వెలువడియె.

విదూ—ఎట్టివాక్కు ?

రాజు—"వత్సా! సంవరణా !

గీ. సాల్వభూమీశ్వరునిపుత్రి ♦ సన్నుతాంగి
నీదుకోమలి కువలయ ♦ నీలనేత్ర
ప్రసవగుణహీన సుమ్మి! యీ ♦ భవమునందు
శారదసమయసహకార ♦ శాఖవోలె." 9

అని చెప్పి భగవానుఁ డంతర్ధాన మొందెను. నేనుఁ బ్రాభాతిక మంగళ గీతంబులచే మేల్కొంటిని.

విదూ—శుభ మగుఁ గాఁక పరితపింపకుము.

రాజు—నే నధన్యుఁడను గదా. పరితపింప కుండు టెట్లు?

విదూ—(నవ్వి) అనేకామూల్యమణి ప్రపూర్ణములగు వేనవేలు కోశాగారము లుండియు ఋణసంతాపము నొందుచున్నాఁడవా? ఆశ్చర్యము!

రాజు—మూర్ఖా! నీ వుద్దేశించిన ఋణవిషయము గాదు నేను మాట్లాడుట. ఇది వేఱు. పుత్రహీనత యనెడి పితరుల ఋణముంగూర్చి చెప్పుచున్నాను.

విదూ—అన్యోన్యము వాదించుకొనుచుండ తార్కికులవలన నే నీవిషయ మిది వఱకే వినియున్నాను. మీరు సూర్యుఁ డానతిచ్చినవిషయార్థ మెఱుంగక పరితపించుచున్నారు. ఆయర్థము నేను జెప్పెదను వినుఁడు. "ఈ నీదేవికి పుత్రులు కలుగరు. వే ఱొకదానిని వివాహముఁ గమ్ము. ఆమె వలన నీకుఁబుత్రులు జనింతురు" అని

రాజు—మిత్రమా! ఇదికూడ యోచింపఁ దగినదే. కాని దేవీగుణగణబద్ధమగు నాయీహృదయము వేఱొకట నుంపఁజాలను. కావున నిప్పుడు నియామకహితకమై యున్న దేవిని దర్శించి వత్తము రమ్ము.

విదూ—ఇటు నిటు మిత్రమా!

(ఇద్దఱుఁ బరిక్రమింతురు).

రాజు—(నిమిత్తము సూచించి) మిత్రమా!

గీ. తనయు జన్మలాభంబునఁ ♦ దక్కనిప్పుడు
ముదము వేఱొంటఁ జేకూరఁ ♦ బోదు నాకు;
అదరుచున్నది నాదక్షి ♦ ణాక్షి చూడ
నెఱుఁగరాదయ్యె దీనికి ♦ హేతు వేమొ!

అదృష్టపూర్వయగు దేవికై మార్గము వెదకుచుండ సునిమిత్త మేల కలుగ కుండును?

రాజు—అదృష్టపూర్వయనఁగా నీయభిప్రాయమేమి!

విదూ—ఇంతకాలమును నియమాంతరిత దర్శన యగుటచే నే నట్లంటిని (ముందునకుం జూచి) ఇదిగో? యిటు చూడుము. భగవతియగు భాగీరథి కనఁబడుచున్నది.

రాజు—(అంజలివట్టి)

సీ. భువనత్రయంబును ♦ బూతంబుఁ గావింప
జనన మొందిన భవ్య ♦ సాధనములు
అతిదుర్లభం బైన ♦ యమరలోకముఁ జేర
వరుస నై నిడిన సో ♦ పానతతులు
శ్రావ్యనాదములచే ♦ సతతంబుఁ గ్రీడించు
హంసావళుల కెల్ల ♦ నాటపట్లు
చంద్రదీధితిపుంజ ♦ సమములై తనరారు
ధవళకాంతులకు నా ♦ ధారకములు

గీ॥ పరిమళాంభోజసంతాన ♦ భాసురములు
నయిన ఘనవీచికానికా ♦ యములతోడ
సతతమును రామణీయక ♦ స్థాన మగుచుఁ
దనరుచుండెను నీకు వం ♦ దనము తల్లి!

విదూ—(ఎదుటిభాగ ముద్దేశించి) ఇది గుహాగృహసమీపమందలి ప్రాకారమును. దీనఁ బ్రవేశించుము.

రాజు—(ప్రవేశమునటించి చూచి) అహో! యేమి యారామసౌభాగ్యము! ఇదిగో యిచ్చట

గీ॥ చిలుక గొఱికినదానిమ్మ ♦ గెలలనుండి
పుడమి రాలినబీజ స ♦ మూహ మెల్ల
వన రమాంఘ్రులనుండి జా ♦ రినవిలాస
యావకపుశోభ నూనిన ♦ యట్లు దోఁచె.

(ఇద్దఱుఁ బరిక్రమింతురు.)

విదూ—(సభయముఁగాబరు గెత్తి) వయస్యా, పరుగెత్తి పోవుదము రమ్ము! ముందు గొప్పయుద్ధము జరుగుచున్నది.

రాజు—నీకీ యకారణభయ మేటికి?

విదూ—ఇట్టిప్రాణసంశయమునకంటె సంభ్రమావకాశము మఱేమి కావలయును?

రాజు—నీప్రాణసంశయమునకు హేతు వెద్ది?

విదూ—(వ్రేలితోఁజూపుచు) ఈమరకతశిలాతలమందు రక్తప్రవాహమునీకగపడుట లేదా?

రాజు—(నిపుణముగా నిరూపించి నవ్వుచు) మిత్రమా! నిజమే యిచ్చట యుద్ధము జరిగియే యున్నది. ఒకానొక దేవతరుణియొక్క—

క॥ యావకవిషశేషాంచిత
భావుకపదపంకజాత ♦ బాణంబులచే

భావజుఁ డేయఁగ మరకత
మీావెలిపునఁ బడియెఁగరము ♦ లిరువెస లలమ్ ।

విదూ—ఈపదవిన్యాసము దేవకన్య దనియే నీ వెట్లు తెలిసికొనఁ గలిగితి

రాజు—ఆకాశమునుండి దిగివచ్చునపు డీయశోక పర్ణంబులనంటినలాక్షారసము

జూడుము

విదూ—సరే యిది యుక్తముగనే యున్నది. (మరల నిరూపించి) ఇచ్చ
పటి యొకపాదవిన్యాస మగపడుచున్నదే. దీనికి వ్యాఖ్యాన మెట్ల
పోని మిృంత మాత్రమునకు నీ వేల? నేనె చక్కఁగా నాలోచిం
వ్యాఖ్యాన మొనర్చెదను. (అన ధ్యాననిమీలితనేత్రుఁ డగును.)

{ అప్పుడు దేవి సపరివారముగాఁ ప్రవేశించుచున్నది. }

దేవి— సఖీ? యుత్పలికా? ఇంతకాలమును పుత్రసంభవ కౌతుకాతిశయము
నార్యపుత్రు నెడబాసి యుంటఁజేసి విరహోత్కంఠ వ్యాకుల పర
చున్నను నాహృదయస్ఫుటితముగా కున్నదిగదా? ఇపుడునియమరహిత
యున్నదానను. ఇఁక నిముసమైన నాలసించుటకు నామన సొప్ప
లేదు. కావున శీఘ్రముగా నార్యపుత్రుని దర్శనోత్సవ మనుభవించె

చేటి—దేవీ ! వర్షర్తునిరోధముం బాసిన శరచ్చంద్రిక కలువకొలనుం జేరక
డునా ? ఇటు నిటు దేవీ !

(పరిక్రమింతురు.)

విదూ—ఆహా! కేవలము నిమీలితనేత్రములనే కాక మనస్సునుఁగూడ
మహాంధకార మావరించినది. కావున నిదియు నీవే విమర్శింపుము.

రాజు—ఇచ్చట తెలియరాని దేమున్నది? ఈపాదవిన్యాస మాదేవకామి
నెచ్చెలిదై యుండును.

విదూ—ఇదియు సక్తముగనే యున్నది. (ఊర్ధ్వముఖుఁడై) ఆహా ఈమాంసఖండ మాకాశమునుండి పడినది. స్వర్గమున మహాదేవాసురసంగ్రామమేమైన
జరుగుచున్నదో యేమొ ?

చేటి—(చెవియొగ్గి) దేవీ? యెదుట పారాశర్యులవారి యాలాపములు వినబడు చున్నవి. కావున మహారాజుగారుం గూడ నిచ్చటికివచ్చేసినట్లు దోచు చున్నది.

దేవి—సఖీ? యీతీవెజొంపములం దొకముహూర్తమాత్రము దాఁగియుండి వారియన్యోన్యసంభాషణము విని పోవుదము.

(అట్లుచేయుదురు.)

రాజు—(మరలనిరూపించిచూచి) ఇది దూంసఖండము గాదు. మందారపల్లవ కల్పితమగు నొకానొక కామినియొక్క,

సీ. చిరుచెమ్మటను దోఁగు ♦ చెక్కుటద్దపుఁ బొత్తుచే
ఘనభాగధేయ సం ♦ కలితమగుచు
మందారపల్లవ ♦ సందోహకల్పిత
మణిదళాకృతులచే ♦ మహితమగుచుఁ
బరిమళాకర్షిత ♦ భ్రమరాళిలులితాల
కప్రసూనపరాగ ♦ దీప్రమగుచు
మకరికాపత్ర సం ♦ ప్రకరచిత్రము లెల్ల
నదికి యుంటను మహో ♦ దారమగుచు

గీ. నమితనురభిళతాఘుమం ♦ ఘుమితమగుచు
వివిధవిధవర్ణసంజాత ♦ విశదమగుచు
నక్షినాసాప్రమోదదా ♦ యకము నగుచుఁ
దనరుచుండెడి మృదులావ ♦ తంసకంబు. 14

దేవి—సఖీ! యీమందారకర్ణపూరము నాకు శంక జనింపఁ జేయుచున్నది.

చేటి—దేవీ! యింతమాత్రముననే యేమి నిర్ణయింపఁ గలము? సావధానలమై వినుచుందము.

విదూ—ఆహా! నాసిద్ధాంత మంతయు నీటిపై వ్రాయఁబడిన యక్కరమువలె పరిణామశూన్య మైనదిగదా? (కర్ణపూరముం దీసికొని) ఈకర్ణపూర మెవరిదో యిదియుం జెప్పగలవా?

రాజు—(వ్రేలితోఁ జూపుచు) ఈపదవిన్యాస మెవరిదైయుండునో వారికర్ణ పాశము నే యిదియు నలంకరించి యుండునని తలచెదను.

విదూ—నీ వేయాధారముచే నట్లు నిశ్చయింప గలిగితివి?

రాజు—పాదవిన్యాస మందును, కర్ణపూరమందును స్వేదబిందువు లగపడుట చేత.

దేవి—పాదకథ గూడా యొకటి కలదా?

చేటి—దేవీ! కానిమ్మింతమాత్రమున నేమి?

విదూ—ఆకాశగమనముచే నిద్దరుగూడా నలసి యుండ నందొకర్తుకు మాత్ర మే స్వేద ముప్పతిలు టెట్లు?

రాజు—ఈస్వేదోత్పత్తి మార్గశ్రమముచేఁ గలిగినది కాదు. శ్లాఘ్యజన్ముఁడగు నొకానొక యువకుని,

గీ. బొమలు గుడియించి, యనురాగ ♦ పూర్ణములగు
వాలుచూపులఁ జూచుట ♦ వలన నుదవు
గగురుపాటునఁ దేలు నం ♦ గకములందు
పంచశరుఁ డిట్లు పొడసూపుఁ ♦ బ్రథమమునను. 15

విదూ—నే నల్పజ్ఞుఁడ నయినను నుంత యుత్ప్రేక్షింపఁ గోరుచున్నాఁడను. ఆకాంతామణి యపాంగశరంబునకుఁ గుఱియైనవాఁడవు నీవే యైయుండ వచ్చును. ఈమానుషలోకమున నీవు దక్క దేవకన్యలచే వరింపఁబడుటకుఁ దగువాఁడు మఱెవ్వఁ డుండును?

దేవి—సఖీ! యీమాణవకుని యుపన్యాసము వింటివా?

చేటి—అవును వింటిని. ఇందు మహారాజుగారి యపరాధ మే మున్నది?

దేవి—వా రపరాధులని యెవతె జెప్పును?

విదూ—(కర్ణపూరము సావధానముగాఁ జూచి) మిత్రమా! ఆశ్చర్య మాశ్చర్యము! ఇచ్చట నేదియో శాస్త్రము లిఖింపబడి యున్నది.

రాజు—(నవ్వుచు) అయినా నాశాస్త్ర మెద్దియో చదువుము.

విదూ—(చదువు చున్నాఁడు.) చాళ్ళో నెడయ నేనేర్పుచు మెచీకలగాఁబ. అక్షరము లెట్లో చదివితిని. అర్థముమాత్రము తెలియుట లేదు. కావున నీ వర్థము జెప్పుము.

రాజు—(సవిమర్శముగా) ఇవి మదనసందేశపర మగు గాథయందలి పద్యాక్షరములని తలంచుచున్నాను.

విదూ—నీ గోటితో వ్రాసి దీనిని పూర్తిచేసినయెడల నీమతికౌశల మప్పుడు శ్లాఘించెదను.

రాజు—(కర్ణపూరముఁ బుచ్చుకొని పూరించి యిచ్చు చున్నాఁడు.)

విదూ—(మఱలఁ జదువు చున్నాఁడు)

గీ. చాతకాంగన శోభన • జలద యందు
నెక్కుడనురాగవతి యయ్యె • నేమి సేయు?
దృష్టిమాత్ర మనోరథ • మెట్లు దీరు?
కను లలరుఁ గాఁకఁ బ్రమదాశ్రు • కణికతతుల. 16

విదూ—ఓహో! నీవు జూడ నెలుకవలె నున్నాఁడవే? అది యొక చిన్న రంధ్రమును విస్తరింపఁ జేయును. నీవు నైదాఱక్షరములతో మహాగ్రంథము రచించితివి. పో నిమ్మీ ప్రసంగము. నే శ్లోకరహస్యవిషయ మిప్పుడు నాకు గోచరించు చున్నది. పద దర్శన మైనది మొదలు నీయాకారము వేఱు విధముగా నున్నది. మన్మథుని కేమైన నిచ్చట నవకాశము దొఱికినదా?

దేవి—సఖీ! నాకుఁగూడ నిదే సందియము.

చేటి—దేవీ! భర్తగారియుత్తరము విని నిర్ణయించుట మేలు.

రాజు—(స్వగతము) ఆహా! యీమాణవకునివచనము నాయవస్థ ననుకరించు చున్నది గదా! నిజమే గుట్టు బెలుంగఁరాని యొకయుత్కంఠ నాహృద్య

యమును బీడించు చున్నది. (ప్రకాశముగా) మిత్రమా! వేఱుగాఁ దలంపకుము. కేవలము విస్మయముచే నే నాకర్షింపఁబడి యున్నాఁడను.

చేటి—దేవీ! వింటివా?

దేవి—నీవు ఋజుమార్గ ప్రవర్తకురాలవు గదా? ఇట్టి గంభీరహృదయులు తమ మానసముల నెప్పుడును వెల్లడింపరు.

విదూ—(వాసన చూచి నట్లభినయించి) దక్షిణమారుత మిప్పుడు బహుళామోదభరిత మై వీఁచు చున్నది. ఆదివ్యజనమే దీనికిఁ గారణ మని తలఁచెదను. కావున నేను వారిని వెదకి కనుఁగొనఁ బ్రయత్నించెదను.

రాజు—మూర్ఖా! ప్రభావాంతర్హిత మూర్తులగు దివ్యజనుల వెదకి గనుఁగొనుట సాధ్యమా?

విదూ—ఒక్కొక్కప్పు డసంభావితతిరస్కరణీకులైనఁగూడ నుందురని విని యున్నాఁడను. కావునఁ బోయి చూచెదను. (ముందునకుఁ బరిక్రమించి చూచి సాటోపముగా) మూర్ఖుఁడ నగు నాకు మాత్రమే కాక దివ్యజనము వివేకరాశివగు నీకును గనఁబడఁగలరు. కావున శీఘ్రముగ వచ్చి చూడుము. (అని రాజును లాఁగుచున్నాఁడు.)

రాజు—అట్లే చూచెదను. (అని చక్కఁగా దిలకించి జనాంతికముగా) మిత్రమా! యిదేమి దేవి యైనదే! నీచాపల్య మిట్లు పరిణమించినది?

విదూ—నా కాఁకలి మిక్కుట మగుటచేతఁ గనులను చీఁకట్లు గ్రమ్మినవి. అందుచే దేవినిఁ జూచి దివ్యజన మనుకొంటిని.

దేవి—పారాశర్యా! శంకింప నక్కఱ లేదు. పవనముగళంబును యువతీంసకంబును యెవ్వతెవని మీ రెంచియుంటిరో యాకాంత గాదు నేను.

విదూ—(జనాంతికముగా) మిత్రమా! దేవి మనసంభాషణమంతయు విని నట్లు తోఁచు చున్నది. ప్రారంభమునుండియు నీమె యిచ్చటనే యున్నదేమో!

రాజు—(ప్రకాశముగా) దేవీ! యకారణముగా కోపముఁ జెంద నేల? ఈయుపరాధమున కంతయు నద్భుతరసమే కారణము.

దేవి—నే నాగ్రహ మొందితినని మహారాజుగారు మాత్రమే చెప్పుచున్నారు

రాజు—ప్రియా! అట్లుఁ దలంపకుము. నీ చిత్తవృత్తి నే నెఱుఁగనా?

చ. బొమలినుమంత యేని ముడిఁ • బొందక యేవిషయంబులైచనం
దమకముచే నురోజములు • తద్దయు నల్లలనాడుచుండ బా
ష్పముల నిరోధమున్ సలిపి • జాఱఁగనీయక యిట్లు ప్రేమకో
పమహితమందహాసముల • భామ! వృథా నను నేఁచ నేటికే.

చేటి—దేవీ! శాంతింపుము. శాంతింపుము. ఈ విషయమున భర్త యపరాధుఁడు గదా?

దేవి—అవునవునే, నియమక్లేశితశరీర నగుటంజేసి ప్రత్యుత్తర మీయఁజాలకున్నాను. కావున నామందిరమున కేఁగెదను; రమ్ము.

(దేవి సపరివారముగా నిష్క్రమించును.)

రాజు—దేవి వెడలిపోయిన దేల?

{ నేపథ్యము నిద్దఱు వైతాళికులు }

ప్రథముఁడు—ఆహా! చండాంశుఁ డాకాశమధ్యము నధిరోహించి యత్యుజ్జ్వలంబుగ వెల్గుచున్నాఁడు.

చ. ప్రభ మఱముతోడఁ బొత్తుఁగొని • పానమొనర్చుట చేసు ధాసమా
నముగఁ దలంచియుం దపన • నాథుని వేఁడిమిఁ దప్తమౌటఁ బు
ష్పమధుపానకుం డెనొక • బంభరనారి; మఱొండు భానుతా
పమున నిజాంగముల్ ముడుఁగ • వల్లభు ఱెక్కలనీడఁ జేరెడిన్.

ద్వితీయుఁడు—

చ. హరిణ మొకండు దప్పిగొని • యాతురతన్ మృగతృష్ణ [చెంతకున్
బరువిడి మోసపోయి, పిద • పం గడుశీతలవారిపూర్ణమౌ

సరసిని గాంచియుఁ దరియఁ జంకుచు నిల్చెఁ బ్రసూనదన్వి భా
స్కరకరతప్తమైనసుమఁచాపము ముట్టగ నెల్లకుండెడిన్.

విదూ—వైతాళికులధర్మమున బ్రతికితిని. మిత్రమా! స్నానమునకు ద్వర పడుము, స్వాఁపడుము. రేపుఁగయము మృగయావినోదార్థ మడవి కేఁగ వలసియున్నది గదా! అచ్చట మృష్టాన్నము దొఱకుట దుర్లభము. కావున యథేష్టముగా కుక్షినిండ భుజింపుము.

రాజు—నీయభీష్టము నెఱవేర్చుటయే కాక దేవిని శాంతింపఁ జేయవలసియు న్నది. కావున నిప్పుడభ్యంతగ మందిరమునకే పోవుదమురమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము

సంపూర్ణము.

---

ఓం

# తపతీసంవరణము.

## ద్వితీయాంకము.

{ అంతట రంభయు మేనకయుఁ ప్రవేశించుచున్నారు. }

రంభ—సఖీ! మహేంద్రుని శాసనపు గొడవలలోఁ బడి యిచ్చట జరిగిన వృత్తాంత మెఱుంగఁ జాలనైతిని. ఇపుడు నీమొగముఁ జూడ వైవర్ణ్యము వహించియున్నది. కావున దీనికి హేతు వెద్దియో తెలుపుము. మన నెచ్చెలి తపతి యిపు డెచ్చట నున్నది?

మేన—సఖీ! మును పాకనాఁడు భగవానుఁడగు భానుఁడు తపతిం దన తోడనై నిడికొని నారదమహర్షితో మాటవరుసన "దీని కనురూపుఁడగు వరుఁడెవ్వఁ" డని యడిగెను. ముజ్జగంబుల వెదకిచూచినను రాజర్షియగు సంవరణుఁడు దక్క మఱెవ్వఁ డని నారదమహర్షి నుడివెను.

రంభ—ఇది నే నెఱింగిన విషయమే. తరువాత,

మేన—అదిమొదలా రాజర్షియం దభిలాషగలదై లజ్జచేఁ దపతి తనకోర్కి వెలిబుచ్చనోడి మెలఁగుచుండెను. పిమ్మట నాతోఁ గలసి యొకానొకప్పుడు తపన వనమునకుఁ బయనమయ్యె. మార్గమధ్యమున నారాజర్షి రాజధాని యగు హస్తిపురం బధోభాగమునఁ జూచి నిలుచుండెను.

రంభ—తరువాత,

మేన—అపుడు నేను నెచ్చెలి భావముం గనిపెట్టి "సఖి! యిది కార్తికేయావాస పరిసరోద్యానము. నీ వలసి నట్లున్నదానవు. కాన నిచ్చట కొంచెము సేపు విశ్రమించి పోవుద" మంటిని.

రంభ—నెచ్చెలి భావము చక్కఁగాఁ గనిపెట్టితివి. తరువాత,

మేన—పిదప నచ్చటి మరకతశిలాతలమున మే మెప్పుడు దిగితిమో యప్పుడే యారాజర్షి వయస్యునిఁ గూడి యచ్చటికి విచ్చేసె.

రంభ—తరువాత,

మేనక—పిమ్మట మన్మథ బాణములును లజ్జయు నొక్కుమ్మడిఁ దన్నుఁ గాసింప నెచ్చెలి యాతని యెదుట' నిలువ నోడి తిరస్కరణీప్రభావమున తిరోధానమొంది నాతోఁగూడ నభస్థలమున కెగసెను.

రంభ—తరువాత,

మేన—ప్రేమపూరితములగు చూపులతోఁ దనమార్గ మంటి చూచుచున్న యారాజర్షింగని నెచ్చెలి ద్విగుణిత మనోభవ వికారయై బొక్కుచుండెను. పిదప నెచ్చెలిం జూచి "సఖీ! నీచెక్కులఁ బొడము చిరుచెమ్మటల బొట్లునెడి ముత్తియముల శోభను గర్ణపూరము తిరస్కరించు చున్నది గదా" యంటిని.

రంభ—తరువాత,

మేన—పిమ్మట నారాజర్షికి రూపమునకుం దగిన బుద్ధికౌశల మున్నదా యని పరీక్షించుటకు నెచ్చెలి యవస్థ నాతని కెఱింగించుటకును నిశ్చయించి నెచ్చెలికడనుండి కర్ణపూరము లాఁగికొని, గాథాపదాద్యక్షరములుమాత్ర మందు లిఖించి, ప్రమాదమునంబోలె నాతనిముందు బడవైచితిని.

రంభ—చతురముగాఁ బ్రవర్తించితివి. తరువాత,

మేన—పిమ్మట నాతఁ డాగాథఁ బూర్తిచేయఁగా విని రోమమునసధర మదరుచుండ నెచ్చెలి నన్నుఁజూచి "అవినీతా! నన్నిటు లేలఁజులకనఁ జేసెదవు?" అని నుడివెను.

రంభ—తరువాత,

మేనక—ఈప్రస్తావమునసైన సర్వవృత్తాంతము మాతనిజేవి విని కుపితయైయుండ నే నపుడు నెచ్చెలిం జూచి "సఖీ! సపత్నీమత్సరమున నీ వీమెం జూచుట నే నెఱింగితినిలే" యంటిని.

రంభ—తరువాత,

మేన—పిమ్మట నెచ్చెలి కోపము వహించి నేను చేలాంచలము పట్టుకొని బ్రతిమాలుకొనినను దిరస్కరించి వెడలిపోయెను.

రంభ—హృదయరహస్యము బట్టబయ లయినచోఁ గన్యకాజనము కోపించును గదా! కానిమ్ము. తరువాత,

మేన—అది మొదలు నెచ్చెలి పడు మదనవేదన యిట్టిదని వచించుట కయినను శక్యము గాకున్నది. అపుడా యవస్థంజూచి నేనూరకుండవలసి వచ్చెను. నేఁడుదయమున నాతోనైన జెప్పకయే తపనవనమున కేఁగినది. ఆ రాజర్షియు మృగయాప్రసంగమున నచ్చోటికే విచ్చేసెనని వింటిని, కావున; మనమిరువుర మచ్చటికే పోయి సఖినూరడింతము.

రంభ—అట్లే

(ఇరువురును నిష్క్రమింతురు.)

{ అంతటఁ దురగారూఢుఁడయి రాజు ప్రవేశించుచున్నాఁడు. }

రాజు—(సవితర్కముగా) ఆహా యేమిది! మృగజాతులకుఁ బరస్పర విరోధము స్వభావసిద్ధమైనను యిపుడు నాబాణంబులచేనయిన భయాతిరేకమున నిచ్చటఁ దపోవనధర్మము సంభవించి పుట్టువిరోధమును శమింపఁ జేయుచున్నది. నాయీమృగయావ్యాపార మిపుడుప్రవృత్తమై యుండ

చ. ఖరశరసంతతిన్ మిగుల ♦ గాసిఁబుచుం గిరిశాబకంబు కే
సరిగుహలోనఁజొచ్చె, మృగి♦జంకివృక్షావళినాశ్రయించె, స

త్వరగతిఁ బాఱె వ్యాఘ్రసతి పజ్జనఁ జేరె వరాహకాంత, కా
సరములు గొంక కేశరభ సంతతి మాటున డాఁగఁ జొచ్చెడిన్

నేనీమృగయాప్రసంగమునఁ బడి యతిదూరగతం బగుహిమాచలో పరిభూమిం జేరితిని. మఱియు నే నా పదవతంసకములఁ జూచినది మొదలు కన్నుఁగూర్చి,

చ. ననవిలుఁ బూనితుమ్మెదల నారిఁ బదింబదిలాఁగి చూచుచున్
ధనువునఁ గూర్పఁగాఁ గుసుమ నాళములన్ సవరించి, క్రుద్ధుఁడై
మనసిశయుండు మూర్ఖమతి మైఁ జెలరేఁగి మదీయమానసం
బున గుఱిలేని యుత్సుకతఁ బూనిచె నీతని యాశ యెద్ది యో.

పారాశర్యుఁడు కర్ణపూరముఁ దీసికొని వచ్చుచు మత్తురంగవేగ మనుసరింపఁ జాలమి నించుక వెనుజిక్కె. కావున నే నిపు డేవినోదంబున నీతమకముం గడపిపుచ్చుదునో తెలియకున్నది.

(నేపథ్యమున)

చంపకుఁడు, చంపకుఁడు.

రాజు—ఆహా! యిది పారాశర్యునికంఠస్వరమే!

{ అంతట భయముతో విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు. }

విదూ—చంపకుఁడు, చంపకుఁడు. (భయము నిరూపించి) ఇట్టి భయస్థానమందు దుర్గామంత్రమైనను రానినాకు రక్షాసాధనములగు బ్రహ్మసూత్రదండకాష్ఠములు రెండును నష్టములైనవి.

రాజు—వయస్యా! భయ మొందకుము. ఏమిది?

విదూ—(రాజును బట్టుకొని బాష్పగద్గదస్వరముతో) మిత్రమా! నన్నేమఱి రక్షింపుము.

రాజు—మిక్కిలి భయ మొందితివి. ఈనీభయమునకుం గారణ మేమి?

విదూ—(వెక్కిలు ఒరికించి నవ్వుచు) నేను నీచెంతఁ జేరినమాత్రముననే నా శత్రువర్గము నశించినది.

రాజు—ఏమి శత్రువర్గమా!

విదూ—నే నింతవఱకు నింద్రజిత్తువలె వానరసైన్యపార్థివులతో మహాపరాక్రమమునఁ బోరాడి వచ్చితిని.

రాజు—(నవ్వుచు) నీపరాక్రమ మే నెఱింగితిని. సజాతీయబుద్ధిచే వానరములు నిన్నుఁ బీడించియుండవు నని తలఁచెదను. ఇది యటుండ నిమ్ము. కర్ణపూర మెక్కడ?

విదూ—ఏమి కర్ణపూరమా! పరమ లుబ్ధుఁడవుగా నున్నాఁడవే. సర్వధనముం గోల్పోయి ప్రాణములమాత్ర మెట్లోదక్కించుకొని వచ్చితిని. మఱియు నా ప్రేమసార మగుకర్ణపూరమును దండకాష్ఠాగ్రమున జన్నిదముతో బంధించి తెచ్చుచుండ శత్రువులగు వానరులు నాపైఁ బడి బలాత్కారముగ లాఁగికొని పోయిరి.

రాజు—కట్టా! ఎంతప్రమాద మొనర్చితివి!

విదూ—మిత్రమా! కోపింపకుము. ఇంకను నీ కాపాడుకర్ణపూర మేటికి? దాని మూలముననే గదా దేవి మిక్కిలి కోపముఁ జెంది మఱల నెంతో ప్రయాసచే శాంతించినది.

రాజు—పోని మ్మింకనూర కుండుము. ఆ పాదముద్రలఁ జూచినది మొదలు నేనత్యంతచేఁ బీడింపఁ బడుచుండియు నీజిహ్వాచాపల్యమునకు వెఱచి నే మఱల వెల్లడింపనైతిని. ఇప్పు డెచ్చటనైన నొక వనప్రదేశముం జేరినఁ గాని నాకూరట గలుగ నేరదు. కావున వెదకుదము రమ్ము.

విదూ—నీవు మృగములజాడ వెదకికొనుచుం జను నట్లు నేను నీమార్గము వెదకికొనుచు వచ్చుచుండి భృగుమహర్షి యాశ్రమపదమునఁ బ్రవేశించితిని. అంత నామహర్షి నాకు గొప్పకథ యొకటి వినిపించెను. దానినంతయుం బూసగ్రుచ్చినట్లు వచింపజాలను. కాని దానిసారము మాత్రము వినిపించెదను. ఇచ్చటి కుత్తరమునఁ గల్యాణవాహన మను పేరునఁ బుష్పోత్త

మునియాలయ మెందుగలదు. పూర్వము భగవంతునింగూర్చి తప మొనర్చి సూర్యభగవానుఁ డిచ్చటనే త్రిలోకముల వెలిగించుశక్తి సంపాదించెను. అదిమొద లాయరణ్యము తపన వనమను పేరునఁ బరఁగుచున్నది. మున్ను త్రివిక్రమమూర్తియై విజృంభించిన వామనమూర్తికరతలమునుండి దానజల మచ్చటనే పడినది. అది కరతలోదక మను పేర నొక సరస్సై విలసిల్లుచున్నది. కావున నచ్చటికే పోదము రమ్ము.

రాజు—ఇట్లయిన జగన్నాథునిపాదకమలము లవశ్యము సేవనీయములు. కావున రమ్ము. ముందు నడువుము.

విదూ—నడువుము నడువుము. (యిద్దఱుఁ బరిక్రమించుచున్నారు)

విదూ—వయస్యా! సర్వకాలరమణీయమగు నీవనమునం బ్రవేశించుటచే నాకు దిగ్భ్రమయే గాక కాలభ్రమయును సంభవించినది. కావున నిప్పుడు జరుగుచున్న ఋతు వెద్దియో నా కెఱింగింపుము.

రాజు—(సావధానముగ నంతటం జూచి) శిశిర వసంతములమధ్యకాల మని తలంచెదను. ఏలయన,

సీ. అవసానదశఁ జిక్కి ♦ నవసియున్న తుషార
సంతానమును జాల ♦ సరకు గొనక
యుదయార్క కిరణంబు ♦ లుద్ధతిం జెలరేఁగఁ
గమలముల్ బహువికా ♦ సమునఁ బొదల
విగతసూనములైన ♦ ప్రేంకణంబులయందు
నల్ల నల్లన నాస ♦ లెల్ల వీడి
యభినవంబుగఁ బూయ ♦ నారంభ మగుచున్న
తరుణవంజుళలతా ♦ దర్శనమున

గీ. నమితసంతోషపారవ ♦ శ్యమునఁ బొదలి
నిజకటాక్షంబునకు దాని ♦ నెలవు సేయఁ

గోరి, తిరుగాడు మధుకరీ • కులము లెల్లఁ
గనుల కెంతయుఁ బ్రియములై • కానఁబడెడి.

విదూ—(పరికించి యాశ్చర్యముతో) మిత్రమా! చూడుము చూడుము. ఇట్టివిచిత్ర మెన్నఁడైనఁ జూచితివా? ముత్తెపుమొగ్గలను స్వేదబిందువులు తేఁగరు వలితాఁకునఁ జలించుచుండ నీపసిండివనలతాకన్యలు మదనపరవశలై రతనంపువిరుల కన్నులతో నిన్నే చూచుచున్న ట్లగపడుచున్నవి. ఇదియ తపనవనము గానోపు.

రాజు—మిత్రమా! చక్కఁగాఁ దిలకించితివి. ఇదిగో! యిచ్చట,

చ. ఇరవగు కెంపుసొంపు జిగి • నీనెడి లేఁజిగురాకు వాతెఱం
దిరముగ నొక్కనిచ్చి మొల • దేఁటులఝంఝమునాదసీత్కృతుల్
నెఱపుచుఁ దమ్మిమొగ్గచను • నెత్తపు రాపిడి యుప్పతిల్ల సు
స్థిరరతిఁ గల్పవల్లి తన • చేరువ మావిని గౌఁగిలించెడిన్. 4

విదూ—స్వప్నమందైన నిట్టివిశేషము లెన్నఁడు జూచి యుండలేదు. కావున మున్ను నీవు వచించినట్టు లాకాశగమనము గూడ నీకప్పుడు తటస్థింపఁ గలదని నా కాశ వొడముచున్నది.

రాజు—(స్పర్శ మభినయించి) మన మిప్పుడు గోవిందమందిరము సమీపించి నట్లున్నది. ఏలయన,

సీ. పరిసరంబుల నున్న • సరసులం దున్న నీఁది
మాలిన్యమును నీటి • పాలొనర్చి,
మహిషాక్షధూపధూ • మమున సంగము వార్చి
ఘనసారరేణు సం • గ్రహ మొనర్చి,
యరుణకేసరభార • భరణకుంకుమసాంద్ర
రమణీయ వనవిహారములు సల్పి,
పరిమళంబున కాస • పడి జేరవచ్చిన
యళికులంబుల నెల్ల • నాదరించి,

గీ. శైత్య సౌభాగ్యలక్ష్మి హా ♦ స్తంబు వట్టి
నాసికారంధ్రయుగళి వి ♦ కాస మొంద
మనకుఁ గల్గిన పూర్వశ్ర ♦ మంబు నెల్ల
దూరముగఁ దోలె నీ వన ♦ మారుతములు.

(ఇద్దరుం బరిక్రమింతురు.)

విదూ—మిత్రమా! దేవమందిరముం జేరితిమి. లోపలఁ బ్రవేశించి నమస్కరింతము.

రాజు—(ప్రవేశము నటించి దోయిలి వట్టి నమస్కరింపుచు)

ఉ. మేనను జన్నిదంబు, మొల ♦ మీఁదను జాఱెడి మౌంజి, [క్రొమ్ముడిన్
జానగుచూడ, జింక యజి ♦ నంబు, బలిక్రతుసామగాన సం
ధానముఖంబుఁ, గన్నుఁగవ ♦ తమ్ములు, గ్రాలఁ బలాశదండముం
బూనిమహాశుచిత్వమునఁ ♦ బొల్చెడివామనమూర్తిఁ గొల్చెదన్.

విదూ—లిఖితాక్షరంబగు నీజిహ్వామూలమున మాటలను పుష్పములతో దేవునిఁ బూజించితివి. అనక్షరవిభవుండనగు నే నన్నో సాధారణ పుష్పములు దెచ్చిపూజించెదను. (అని నిష్క్రమించును.)

రాజు—ఇపు డిచ్చట ననిర్వాణమాణిక్య దీపమాలాదూరీకృతగర్భ నిలయాంధకారంబును, జాంబూనదాకల్పకల్పితదివ్యవిగ్రహ వేషవిశేషంబును, సుధాసౌరభ సుభగసురతరు సుమనస్సంపాదిత భక్తివితానంబును నగు నీసపర్యాక్రమము దివ్యజనసంప్రాప్తిని సూచించుచున్నది.

{ అప్పుడు మన్మథవికారముతోఁ దపతి కూర్చుండియుండును. }

తప—(దీర్ఘనిశ్వాసముతో) మనోరథసిద్ధిఁ బడయఁ గోరి యెట్లో మానసముఁ గుదురు పఱచుకొని నే నిప్పుడే భగవానుఁడగు వామనమూర్తి పూజ

ముగించి వచ్చితిని. ఇపుడు సఖీజనమైన నా చెంత లేమింజేసి యీ ప్రదేశము నిర్జనమై యున్నది. కావున స్వేచ్ఛానురూపకముగ సంకల్పసంగసౌఖ్యము లాభువనైక మోహన విగ్రహునితో ననుభవించెదను.

(ధ్యానస్థిమితయై యుండును)

{ అంతట రంభా మేనకలు ప్రవేశించుచున్నారు. }

రంభ—సఖీ! నెచ్చెలి తపతి యెచ్చట నున్నది?

మేన—కరతలోదక తీరమందలి పటికంపుఁ జవికెపై యాపె కభిమాన మెక్కుడు. కావున నిపుడచ్చటనే యుండనోపు.

రంభ—అట్లయిన నచ్చటికే పోదము రమ్ము. (అని పరిక్రమింతురు.)

మేన—సఖీ! నెచ్చెలి యేమో యాలోచించుచు నించుకయైనఁ జలనము లేకున్నది. యీపె యాలోచన యెద్దియో!

రంభ—ఆహా! నెచ్చెలియొక్క యీదశ యపూర్వముగా నున్నది. కావున నిచ్చటనే దాఁగియుండి యీపె ప్రయత్నముం దెలిసికొని పోవుదము. (గోడచాటున దాఁగి యుందురు.)

{ పటాక్షేపమున విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు. }

విదూ—వయస్యా! అశ్చర్య మాశ్చర్యము! విస్మయావహం బగు నొకసరోవరతీరంబున ఘనపటలఘనీభూతం బగు నొకశిలరాసిఁ జూచివచ్చితిని. మఱియు నా నీరమున లక్ష్మీప్రతిమ లిఖింపఁబడి యున్నది. కావున త్వరితముగ విచ్చేసి తిలకింపుము.

రాజు—మూర్ఖా! నీర మెప్పుడును బల్లము ననుసరించి పోవుట స్వభావము. కావున స్థిరీభావము, నూర్ధ్వగమనంబును సంభవించు టెట్లు?

విదూ—కరతలగతామలకవిషయమై యింతవివాద మేల? ప్రత్యక్షప్రమాణమున సాధించెదను. నావెంటరమ్ము. (అని రాజును లాగుచున్నాడు.)

విదూ—ఆ పదవతంసకంబు లేలతాంగివైయుండునో యా లతాంగియు నిప్పుడు మన కగపడుచున్న యీలలనామణియు నొక్కతెయే యైనచో ముక్కిలి యనుకూలముగ నుండును.

రాజు—విధివిలసితంబు లెవ్వఁడెఱుఁగును? ఇచ్చట దాఁగియుండి యీ లతాంగి స్వైరాలాపంబుల విని నిశ్చయింతము. (అట్లు చేయుదురు.)

తప—(విషాదముతో) ఛీ! కేవల మాత్మచ్ఛందమున నే నాతనిం జేరఁబోవుచు కన్యకాజన విరుద్ధము గాఁ బ్రవర్తించితిని.

సఖులు—భయముతో (వక్షంబునఁ జేయిడుకొని యొకరి నొకరు చూచుచున్నారు.)

రాజు—(చింతతో మరలి) మిత్రమా! అన్యానురక్తయగు వనితారత్నముపై నామనశ్చక్షులును బ్రవర్తించినవి. కావున నిట నుండరాదు. పోవుదము రమ్ము.

విదూ—ఇంచుక వినుట మాత్రముననే యథార్థము గ్రహించుటకు బ్రహ్మదేవుని కేనియు శక్యంబుగాదు. ఈ రమణీయమూర్తి నింద్యకర్మ మొనర్పఁ జాలదని నానమ్మకము. కావున నింకను కొంచెము విని పోదము.

తప—[నిట్టూర్పువిడిచి చూచి]సంకల్ప సంగము కూడదని యనవసరముగా నన్నే నే నేల యధిక్షేపించు కొంటిని?

సఖులు—(హర్షముతో) బ్రదికితిమి.

విదూ—మిత్రమా! వింటివా?

రాజు—(వెనుక మరలి) ఇంతమాత్రముననే నీ కూరట గల్గెనా? చూడుము.

ఉ. ఇమ్మగు ప్రేమచే యువకు నెవ్వనినో మదినిల్పి బొక్కు నీ
కొమ్మ నుకర్త నా యెదుటఁ గూర్చి, యొకు మ్మడి పూవుటమ్మ్మలం
జిమ్ము సుహాస్తి మోవ మను చీఁకటి నించుక లాలవంబు నా
నెమ్మదిఁ గూడ నేఁ చునెడ నిక్క మిదే ధృతి నాశ్రయించెదన్

తప—సఖీ ! మేనకా !

మేన—సఖి నన్నుఁ జూచెనా యేమి?

తప—మేనక యెక్కడ?

మేన—ఋజుబుద్ధి యగు నీపై సంకల్పమే నన్నాహ్వానించుచున్నది.

రంభ.—(ఈర్ష్యతో) ఈమదనసంభ్రమ మందైన నెచ్చెలి నన్నుఁ దలంపక పోయె.

మేన—మొదటినుండియు నీ వీవృత్తాంత మించుకైన నెఱుంగవు. నే నన్ననో కొంత యెఱుంగుదును. అందుచేత సఖి యట్లుపలికినది.

తప—హృదయమా! ఏమిది హృదయ మెక్కడ నున్నది?(స్మృతి నభినయించి) ఓహో! యాసుకుమారుఁడు హరించెఁ గదా. దేవా! కుసుమాయుధా! నీ వన్ననో నన్నుఁ గారింప వచ్చితివి. నీశరంబులకు లక్ష్యభూతం బగు నాహృదయ మన్ననో సకలభువనైకనాథునిహస్తగతమై యున్నది. సమర్థుఁడ వైనచో నచ్చోటి కేఁగి పరాక్రమింపుము.

రాజు—(సాభిలాషముగా) ఏనికై దీనికీ యుత్తలపాటు సంభవించెనో యాతఁ డిపు డిచ్చట సన్నిహితుఁ డై యున్నచో జన్మవంతులలోఁ బ్రాగ్రేసరుఁడగును గదా. ఏలయన

చ. తలిరులవింటివానిశర • ఘాటి సహింపఁగ లేక దీనయై
వెలదు లుతమ్ముఁగూర్చిపల • వించుచుఁబల్కు విలాపవాక్యముల్
వలనుగ విన్న యట్టియెలఁ • బ్రాయము వారల నెమ్మనంబులన్
మెలఁగెడిసౌఖ్యసంతతికి • మేళనమే చెలువై దనర్చెడిన్. 10

విదూ—అనుచితంపు టూహ లికఁ జాలు నూరకుండుము. నిన్నే స్వీకరించుటం జేసి గదా భువనైక నాథుడని యాపె వచింప సాహసించుట.

తప—(చింతతో) ఇట్లెంత కాలము దుఃఖింతును? మనఃప్రియుఁడు సదాఁ మనాత్మసవర్తియయ్యు నన్నుఁ గరుణింప కున్నాఁడు. యేదేవున నుగ్రహంబున నే నుద్భవించితినో యట్టి యీకల్యాణవాసనుఁడు నాచే నారాధితుండయ్యు నన్ననుగ్రహింప కున్నాఁడు.

రాజు—(కరతాళము వైచి) అపుడు నేఁడిలకించిన యీదేవునిసపర్యావిధాన సంతతము నీకైహస్తకౌశలమునఁ గలిగినదే.

తప—దుఃఖభాజనం బైనయీ నాళికేర పాతనికే యర్పించెదను. (బాష్పగద్గదముగా) అయ్యో! దిక్కు లేనిదాన నైతిని. రంభామేనకల చరమాపరిరంభణం బందకయే ప్రాణముల వదలుచున్నాను. (లేమ చున్నది)

రాజు—ఆహా! అతిభయంకర మతిభయంకరము! (సమీపింప నుంకించును.) పాపము శాంతించుఁ గాక!

సఖులు—(సంభ్రమముతో సమీపించి కన్నీళ్లతోఁ) సఖీ! అమంగళము ప్రతిహతమగుఁగాక! అనేకకల్పాంతరములు మమ్మాలింగనముఁ జేసికొను చుండుము.

తప—ఆహా నెచ్చెలులా! (లజ్జనభినయించును.)

రాజు—(ఆనందముతో) మిత్రమా! యన్యాసక్త యగుదానిని నిజసఖులతోఁ గూర్చి దైవము మేలొనర్చెం.

విదూ—మీరిసంభాషణమువలన నీపై యభిలాష స్పష్టము కాఁగలదు.

తప—(తనలో) వీరియాగమనముచే మత్స్యహారోదయుఁడగు దండధరుని దరి చుట తప్పిపోయినది. ఇప్పుడును జిత్తస్థైర్యమును విడువ కుందును గాక.

సఖులు—సఖీ! ప్రాకృతస్త్రీలమార్గ మనుసరించి నీవేల నిష్కారణముగా మరణింప నుంకించితివి? ప్రాణసమానలమగు మేము నీమనోరథముం దీర్పఁ జాలమా? నీయాకారరూపవిభ్రమాదిగుణంబులకు లోఁబడని వాఁడీజగంబున నుండునా?

తప—ఈవచనంబులచే నన్నిఁక బాధింపకుఁడు. నాహృదయసంతాప మతిదుస్సహమై యున్నది. నన్నుఁ బట్టుకొనుఁడు.

మే:—(పట్టుకొని స్పర్శనభినయించి) అబ్బా! దీనియంగసంసర్గమునకన్న హుతవహోత్సంగప్రవేశము చాల సుఖకరము. (రంభం జూచి) సరస్సునుండి సరసీరుహపత్రంబులం దెచ్చి నెచ్చెలికి వీవుము.

రంభ—(అట్లు చేయును.)

మేన—నలినీపత్రసమీరమును లోనఁ జొఱనీక స్తనాంశుక మడ్డగించుచున్నది. కావున దానిం దొలఁగింపుము.

తప—ఇది మఱుఁగులేని ప్రదేశముగా నున్నది. కావున నన్నెవరైన జూతురేమో శరీరము బయలు పఱచుటకు సిగ్గగుచున్నది.

మేన—అస్మన్మనోరథసిద్ధికి సంవరణసాన్నిధ్య మున్నదిగదా!

తప—(సంభ్రమముతో దిశలు బరికించి) ఎచట నెచట? నార్యపుత్రు—(అనుస్థోక్తియందే లజ్జచే ముఖము వాంచి యుండును.)

మేన—(నవ్వుచు)—సఖీ! ఆ స్థానముఁ దత్తరింపనేల? ఈభిత్తి నుద్దేశించి సంవరణపద ముచ్చరించితిని. అంతియ కాని నీహృదయమున నున్న పురువంశప్రదీపకుఁడగు రాజర్షిని గూర్చి కాదు.

రంభ—అతిప్రమాథమగు వీని మన్మథవికారము నన్ను ఖేదపఱచినను యథోచితస్థానంబును జెందుటఁజేసి నేను సంతసించుచున్న దానను.

రాజు—(సంతసముతో) వినఁదగినవాని వింటిని. హృదయమా! యింక నీ జనునియందు నిరాటంకముగాఁ బ్రణయప్రసారము వృద్ధిఁ బొందింపుము. మఱియు,

చ॥ సుమశర! మంజుపుష్పపరి♦శోభిహిమాద్రితరుప్రవాళబృం
దములఁ బటీరశైలపవ♦నమ్ములు వేర్చి కదల్పఁ గాఁక! పం
తమున రణోర్వి నన్నెదిరి♦తాఁకఁగనీదొనదోయి నిప్పుడే
భ్రమరవినీల పుంఖసుమ♦బాణపరంపరనింపుమీ వెసన్

విదూ—ఈతన్వి తనయుని పేరి యగ్నికి సంభవస్థానమగు నరణిగా దైవముచే నీకొఱకుఁ గూర్పఁబడియె.

(నేపథ్యమున)

గీ. సాయపుంగృత్యముం దీర్చి ♦ సమయ మయ్యెఁ
గలుషముల నెల్ల తీర్థోద♦కములఁ బాపి

జలజమిత్రుని కర్ఘ్యపూ ◆ జనము సల్పఁ
ద్వరగ గన్నేరువిరులు, గం ◆ దమును దెండు. 12

సఖులు.—(సంభ్రమముతో) సఖీ! లెమ్ము లెమ్ము. సూర్యోపస్థానసమయ మతిక్రమించు చున్నది.

తప.—(తనలో) ఈయవస్థ తండ్రిజూచును గాఁబోలు. మన్మథశరనిపీడితసారంబు లగు నీయంగములతో నే నెట్లు బోఁ గలుగుదును? అయినను దైవాచార మనతిక్రమణీయము గదా? (ప్రకాశముగా) సఖులారా? అట్లే చేయుదము (అని అందఱు నిష్క్రమింతురు)

రాజు—అయ్యో! కష్టము. నామనోరథభూమి తిరోధాన మొందినదిగదా? అశనిపాతణమైన యీవాక్య మెవ్వఁడు వచించెనో! ఒకవేళ నానయన భాగ్యమునకిది యవసానదశ గాఁబోలు.

విదూ—అతిసమీపమున నున్న యీతపోవన మందలి ఋషు లిట్లుద్ఘోషించిరి.

రాజు—(చూచి) మిత్రమా? ఈమార్తాండుని దివసదీక్షాధికార మవసాన మొంది నట్లే యున్నది. ఏలయన,

చ. మానితపద్మరాగమణి ◆ మండలతుల్యము లైనమేఘసో
పానములెక్కి దినేందిర యు◆ పాంపతిఁ జేరఁదొడంగెఁ; మల్లెపూఁ
దేనియతావులం జిలుకు ◆ తెమ్మెర సోఁక సరస్థచక్రవ
ద్వానన గుందఁ జొచ్చె విర◆హార్తిభయంబెదఁ గూఱి దీనయై
మిత్రమా? యిఁక నాచరణీయ మెద్ది?

విదూ—రాక్షసభీతుఁడగు కులపతి భృగుమహర్షి మిమ్మచ్చటికిఁ దీసికొని రమ్మని నన్ను బ్రార్థించెను. కావున నచ్చటికే పోదము.

రాజు—మంచి దట్లే అవశ్యకరణీయము.

(అని యిద్దఱును నిష్క్రమింతురు.)

ద్వితీయాంకము.

సంపూర్ణము.

---

ఓం

# తపతీసంవరణము.

## తృతీయాంకము.

---

{ అప్పుడు హోమసాధనహస్తుఁడగు తాపస కుమారుఁడు ప్రవేశించుచున్నాఁడు. }

తాప—(విస్మయముతో) అహో? అప్రతిహతప్రభావుఁడగు సంవరణసార్వభౌము పరాక్రమవిధాన మవాఙ్మానసగోచరము గదా! ఇపు డీతఁ డేదియో నొకమనస్తాపంబుచేఁ బీడింపఁ బడి కృశీభూతశరీరుఁడై యుండినను,

గీతమాలిక. అమలశిఖలను బోలు నీ ◆ తని శరంబు
లద్రికాయుల నసురసే ◆ నాధిపతుల
బెడిదముగఁ దాఁకి, ప్రాణంబు ◆ లెడపుఁ గాఁక
శరమరుద్వేగమునఁ బడి ◆ చని చని తద
సురజనంబు లాశ్రమ బాహ్య ◆ ధరణి నెచటఁ
బడిరో చిత్ర మాదెలియ ది ◆ ప్పుడును గూడ. 1

"వత్సా కౌండిన్య! సంవరణశరంబులచే నిహతులయిన రాక్షసుల భార్యలాతనికిఁ బ్రత్యక్షంబుగఁ గీడు సేయ నోడి మాయలు గావింతురని తలఁచెదను. అట్టిమాయల నశింపఁజేయుట కొకతంత్రము గలదు. దాని నిప్పుడు నెఱవేర్ప వలసియున్నది. కావున నీవుపోయి కుశలు, సమిధలు, పుండరీక సంచయంబులును గొనిరమ్ము" అని గురుఁడు నాకాజ్ఞ నొసంగె. నిరతోపయోగముచే నాశ్రమసమీపప్రదేశము లన్నియు హోమసాధనరహితములై యుండఁ జేసి దూరారణ్యభూముల కేఁగి

నేనీయింధనభారముం జేకలసివచ్చెఁ. అందుచేఁ బవలంతయు గడచి సాయంసమయము సంప్రాప్తమైనది. (నలుదిక్కులం జూచి) ఆహా? పక్షిజాతులకుఁ గూడ సంసారధర్మమత్యుచ్ఛమైనది గదా? ఇదిగో! యీసరస్సునందు,

సీ. సామువెక్కులు రాఁగ ♦ జలజపత్రములందుఁ
బొరలాడునిజశిశు ♦ పుంజములను
లకుముకిగరితె ల ♦ ల్లనె పక్షములచేత
నొకచోటఁ బ్రోవుగా ♦ నుంపఁదొడఁగె,
కలువలఱేని రాఁ ♦ క సమీప మగుచుంట
నెఱిఁగి నెమ్మదిలోన ♦ వెఱపుఁ బొంది
నీరజాతముచాల ♦ నేర్పుమై దొరకొని
దళములనెల్ల బం ♦ ధన మొనర్చెఁ.
గీ అంత నొకభృంగసతి దాని ♦ చెంత కరిగి
లోన నిజకాంతుఁ డుండుట ♦ మానసమున
నెఱిగి తానును శయనింప ♦ నెంచి, మిగుల
దమకమునఁ దిరుగాడెడిన్ ♦ దానిచుట్టు. 2

(పరిక్రమించుచు ముందునకుం జూచి) ఓహో! సంరంభదూషితముఖకాంతిచే నున్నయీరాజర్షి వయస్యుంగూడి యిటే వచ్చుచున్నాఁడు. ఇది యాశీర్వాదసమయము గాదు. కావున నాశ్రమమార్గముం బట్టి పోయెదను. (అనిష్క్రమించుచున్నాఁడు.)

(ఇది విష్కంభకము)

{ అప్పుడు రాజును విదూషకుఁడును ప్రవేశింతురు. }

రాజు...(సంరంభముతో) ఓరీ దురాత్మా! మన్మథచండాలా!

చ. దనుజబలంబు నస్త్రతతిఁ • ద్రచ్చిన నం దృణరీతి నెంచి, యు
ర్వ్వ నతనుతాతనుత్ర మని • బీరమునం జెలరేఁగె దీవు రు
ద్రనయనవహ్ని మగ్గి నను నీ • ధైర్యము వంచనమై హరించు నీ
తనుతరశక్తులన్ వెదకి • తాఁకెఁగఁజాల వెనాదు బాణముల్ 3

అయ్యో! ఛీ! యసంబద్ధప్రలాపము లాడుచున్నాఁడనే! నాపై విజృంభించుట కాతని కొకానొకప్పు డనుజ్ఞ నిచ్చియుంటిని గదా! కావున నీతని నిష్ఫలునవయించెదను. భగవానుడా! యీయపరాధము సహింపుము. నిన్నిట్లు వేఁడుకొనుచున్నాఁడను.

చ. అలికులముల్ మరంద రస • మాని తలంగిన లేఁతమావిపూ
వుల సమమంతయుఁ నిలుపుఁ • బొందని గందపుఁగొండగాడ్పులన్
గలుగదు సిద్ధినీకు మదనా! యిఁక నేర్పరివైన నేయుమా!
కలువలకప్పు నేలు నల • కల్కిమిటారపుఁ జాలుచూపులన్.

విదూ—(సనిర్వేదముగాఁ దనలో) అహా! అతిఘోరముగ నున్నదే! మహావ్యాధి చికిత్సకుం గడంగిన దుర్వైద్యునిభంగి నే నీతనియనంగవ్యాధిం జూచి తత్తరపడుచున్నాఁడను. అనుచరసమూహంబుల నీతఁడు వెనుకఁ బంపుటం బట్టి మాఁడ నగరగమనవృత్తాంతముఁ బూర్ణముగ మాని వట్టిగపడుచున్నది. ఈయడవిలో నేనొక్కఁడ నేమి చేయఁగలను? కాని యిట్లు చెప్పి చూచెదను. (ప్రకాశముగా) మిత్రమా! నీయపూర్వవచనంబులు విన నాహృదయంబు తల్లడపడుచున్నది. కావున ధీరుడవై యుండుము.

రాజు—(తన్ను తానె నిలువరించుకొని) మిత్రమా! నీవు వచించినది నిక్కమే. మాటలు మనశ్శక్తిమూలకములు. అట్టి మనశ్శక్తిని యాతన్వంగి నిర్మూలింపఁజేసినది. కావున ననాకులంబులై యెట్లుండును?

విదూ—(విషాదముతో) ఇట్లయినచో నిఁక శరణ మెద్ది?

రాజు—(దీర్ఘనిశ్వాసముతో) తదంగసంసర్గశ్లాఘనీయమగు స్ఫటికమండపము దప్ప వేఱేమి యుండును ? కావున దారిఁ జూపుము.

విదూ—(ప్రత్యాశతో) రమ్ము. (ఇద్దఱుఁ బరిక్రమింతురు.) ఇదిగో! యా మండపము. ప్రవేశింతము రమ్ము. (ప్రవేశింతురు)

రాజు—(మండప మంతటను జూచి విషాదముతో) ఆహా! వస్తుసంపద లస్థిరములు గదా! చూడుము,

ఉ. అంబుజగేహ లేని కల • శాంబుధి, యంబిక లేనిభస్మశు
భ్రంబగు శంభుమేను, సుర•వాహిని లేని తుషారవార గా
రంబగు శీతశైలమును • రాజిలనట్లు మదీయజీవతు
ల్యంబగు కాంత లేని తెలి•దా నెలవుం బోలు పేదియుండెడిఁ.

విదూ—పూర్వ మప్పద్మగంధి యధిష్ఠించుటం జేసి దివ్యపరిమళంబుల వెదజల్లుచున్న యీ ప్రదేశమును నీకు సహధర్మచారులగు మధుకరంబులు విడఁజాలక మూఁగియున్నవి. కావున నిచ్చటఁ గూర్చుండి పొద్దు బుచ్చికొనుము.

రాజు—మిత్రమా! అట్లు గాదు. మధుకరంబులు నా కెట్లు సహధర్మచారులగును?

చ. శర మనుకూలలైన నిజ•కాంతలు గానము సేయుచుండ నిరం
తరమును దమ్మిఁగొల్చుఁగ మ•నఃప్రియభోగములం భుజించి వి
స్తరకుతుకంబుతోడ నిట•ధన్యతమై జరియించుచున్న బం
భరవరరాజితోడ సరి • వత్తునె యెన్నఁటి కేని మిత్రమా!

(కూర్చుండి దాహవేదన భావించుచు) ఆహా విధివైపరీత్యము! సుఖోత్పాదనకై గల్పింపఁబడిన యీప్రదేశము నా కతిదుస్సహసంతాపమును గలుగఁ జేయుచున్నది గదా! మిత్రమా! నే నిఁకఁ దాళఁజాలను. కావున నీకరతలోదకమునుండి శిశిరవస్తువులం గొనితెచ్చి నాకు శయ్య నమర్పుము.

విదూ—అట్లే. (అట్లు చేసి) ఇఁక బరుండుము

రాజు—(శయన మభినయించి ప్రక్కలం జూచుచు) అప్పద్మగంధికి శిశిర సమీరముం గల్పించుటయం దేదియుపకరించెనో యట్టి యీనళినపత్రం బుచే నన్ను వీవుము.

విదూ—(అట్లు చేయు చున్నాఁడు.)

రాజు—(స్మృతి నభినయించి నిట్టూర్పుతో) హా! ప్రేయసీ! ఈ నళినపత్రంబుచే వీఁచుచు నీనెచ్చెలి పర్యేదఁ దొలఁగింపఁ బురికొల్పినను వినక నా లోచనంబులకు వైఫల్యము ఘటింపఁ జేసితివి. అట్లయినను,

చ. హిమమున నించుకంత తెలుఁ ♦ పెక్కియొసంగు పసిండితమ్మితో
సమమయి గ్రాలుచుంబయుఁట ♦ సందునడాఁగిననీ స్తనంబుపై
విమలశిలాప్రశస్తతర ♦ భిత్తి నిరోధముఁ ద్రోసిపుచ్చుచుం
దమకము నొందునానయ ♦ నప్రభ వేప్రసరింప లేవొకో. ॥7

మిత్రమా! నళినీపత్రసమీరంబుచే మన్మథాగ్ని ప్రజ్వరిల్లినది. కావున నించుక విరమింపుము.

విదూ—మంచి దట్లే (విరమించు చున్నాఁడు.)

{ అంతటఁ దపతియు మేనకయు
నాకాశగమనమునఁ బ్రవేశింతురు. }

తప—(దీర్ఘనిశ్వాసముతో) చెలీ! హస్తిపురసమీపమునకు వచ్చితిమా?

మేనక—(విషాదముతోఁ దనలో) నా ప్రియసఖికి మదనోన్మాద మెప్పుడు శాంతించునో గదా! (ప్రకాశముగా) సఖీ! అచ్చట మన కేమి పని?

తప—(విస్మయముతోఁ దనలో) నే నేమంటిని! (ప్రకాశముగా) కార్తికేయావాసపరిసరారామ మతిరమణీయ మైనది గదా!

మేన—సఖీ! యిప్పుడతఁడు వేఁటాకచోటి

తప—అసంబద్ధము లాడెద వేల?

మేన—(నవ్వుచు) ఎవ రసంబద్ధము లాడునదియుఁ దెలియుచునే యున్నది.

తప—పిచ్చిదానా! అతనికిఁ జలనము కలదా?

మేన—అవును. కలదు.

తప—అనఁగా నీయభిప్రాయ మెద్ది?

మేన—నీహృదయాగత మైనదెద్దియో యదియే.

తప—నాహృదయ గత మైన దెద్ది?

మేన—(నవ్వుచు)సంవరణమహారాజు.

తప—(రోషముతో) అన్యాగతమనోరథుం డగునాతని నుద్దేశించి నన్నేల పరిహసించెదవు?

మేన— నేనుపరిహసించుచుంటినో లేక నిజము నే వల్కుచుంటినో నీహృదయమునకే తెలియును.

తప—పరిహాసమికఁజాలును. భగవానుఁడగు భృగుమహర్షియాశ్రమమునకు మార్గ మెద్ది?

మేన—మన మాశ్రమపదమునకు బయలు దేఱ లేదు. రంభను మాత్ర మచ్చటికిఁ బుత్తెంచి మేము తపనవనమునకు బయలు వెడలితిమి.

తప—ఓహో! తపనవనమునకా మనము బయలు వెడలినది! అట్లయిన నావన మెచ్చటనున్నది?

మేన—(క్రిందికిఁ జూచి) ఇదిగో! స్ఫటికమండపముయొక్క శిఖర మగపడు చున్నది. కావున నిఁక దిగుదము. (దిగుట నభిన యింతురు).

{ అంతట బద్ధకర్ణపూరదండ హ స్త యై
రంభ ప్రవేశించు చున్నది. }

రంభ—"భృగునాశ్రమంబునకుఁబోయి యారాజర్షి యచ్చటికి వచ్చెనో లేదో దెలిసికొని రమ్మని నాకు సఖులు జెప్పి పంపిరి. అతఁడన్నో ప్రదోషారంభము నే వయస్యునిఁ గూడి తపనవనాభిముఖుఁడై బయలు వెడలెను. కావున నేనును దపనవనమునకే పోయి సఖులం జూచెదను."

మేన—(చూచి) సఖీ! బద్ధకర్ణ పూరదండము బుచ్చికొని యిదిగో రంభ వచ్చుచున్నది.

రంభ—(సమీపించి) చంద్రికాదుకూలావృతంబగు నీప్రదోషము నిన్ను సౌఖ్యాంబుధి నోలలాడించుట లేదా !

తప—(నిట్టూర్పువిడిచి) నా సుఖవృత్తాంత మట్లుండ నిమ్ము. దీని నెచ్చట నుండి తెచ్చితివి?

రంభ—తపోవనమునుండి నేను మరలివచ్చుచుండ నెద్దియో యొక సహకార శాఖనుండి యిది నాముందటం బడియె. అప్పుడు నే నిది యేమియై యుండునోయని యించుకయోచించి పిమ్మట బుచ్చికొని వచ్చితిని.

మేన—(చూచి)సఖీ! ఇదిగో! యీ గాథాక్షరంబులు. అప్పుడు హస్తిపురంబున మనచేతినుండి జాఱిపడిన కర్ణపూరమిది. ఆరాజవయస్యుని ప్రమాదముచే నిట్లు జరిగియుండెనని తలంచెదను.

తప—(రంభను జూచి) సఖీ ! ఇప్పుడాబ్రాహ్మణుం డెక్కడ నున్నాడు ?

రంభ—(నవ్వుచు) ఈతపోవనమందే యెచ్చటనో యున్నాడు ?

తప—(ఖేదమభినయించి) సఖీ ! ఆకాశగమనాయాసము నన్ను బాధించుచున్నది. కావున నీస్ఫటికమండపమున విశ్రమింతము.

సఖులు—అట్లే చేయుదము. (ప్రవేశమునటింతురు.)

విదూ—(సంభ్రమముతో) ఏమిది ! ప్రదోషారంభముననే ప్రభాతము సంభవించినదే ?

మేన—(జనాంతికముగా) సఖీ! యిదిగో యీరాజర్షి జ్వలితంపు సంతాపంబునంబడి శిశిరోపచారంబు లనుభవించుచుం బరుండియున్నాడు. మండపాభ్యంతరమును వెలింగించుచున్న నీప్రభాజాలంబులం జూచి భ్రమపడి యీబ్రాహ్మణుండు ప్రభాతమని పలవరించుచున్నాడు. కావున తిరస్కరణీ ప్రభావమున ప్రతిచ్ఛన్నలమై యుండి వీరివ్యాపారమును గనిపెట్టుదము. (అట్లు చేయుచున్నారు.)

విదూ—(విస్మయముతో) మిత్రమా! మఱల రాత్రివచ్చినది. ఈ రమణీయ ప్రదేశమున ఋతుసంకరంబువలె అహోరాత్రసంకరముగూడ కలిగినది. కారణమేమై యుండును?

రాజు—(సవిమర్శముగా) దివ్యజన ముండుచోట యేమి విచిత్రముండదు? మిత్రమా! వీఁచుట లే దేల?

విదూ—(భయముతోఁ దనలో) క్షణక్షణప్రవర్ధమానంబగు నీతనిమదనోన్మాదము నాకు భయముఁ గలిగించుచున్నది. (ప్రకాశముగా) మిత్రమా! నీ కింతయును వేల? నీవె వీవ వలదంటివి గదా!

రాజు—ఈతప్పు నాహృదయమునది. హృదయమా! ఆ పద్మగంధి లభింపమిం జేసి నేను పరితపింతును గాఁక; నీ వన్ననో,

చ. ఘనతరలజ్జచే మొగముఁ గ్రక్కున నంసమునందుఁ జేర్పఁ జుం
బన మొసరింతునా తన్నవిలీఁ బట్టి, తటాలునఁ గౌఁగిలింతు, నం
త నలిగినట్టినీవి తరుణి యిమ్మను వేఁచి సడల్ప నేర్తు, నీ
వనయము క్రోధచక్రములయందు జరింతిఁక ఖేదమేటికిన్.

తప—(అసూయతోఁ దనలో) మదనా! యేమి నీయవివేకము? నాహృదయము భేదించి యతఁ డభిలషింపకపోయినను యాతని కర్పించితివి. చిరకాలమునుండి నేను ప్రార్థించుచున్నను యాతని హృదయము నాకభిముఖమగు నట్లు చేయఁజాల కున్నాఁడవు. (ప్రకాశముగా) ఇతఁడు తన దేవిం గూర్చి పరితపించుచున్నాఁడు. కావున మన కిట నేమి పని?

మేన—సఖీ! నీవు నూతనవే కదా! ఇతఁడు దేవీవిరహోత్కంఠుఁడు గాఁడు "నవవధు" వనుమాట నితఁడు వచించుచుండ నీవు వినియుండ లేదా?

తప—వింటిని. అయినను నావిషయ మేమున్నది?

రంభ—అందువలననే గదా సందియము. మరల విందము.

విదూ—మిత్రమా! పద్మరాగ గవాక్షాంతరమునుండి ప్రసరించుచున్న యీ చంద్రమయూఖములు నీ యనంగ మోహమును బోఁగొట్టుట లేదా?

రాజు—పుణ్యవిహీనుపట్లఁ బదార్థశక్తులు విపరీతములుగా మారును గదా. చూడుము.

ఉ. పున్నమ రేలఁ దోఁచి పరి ♦ పూర్ణకలాగ్రహణాభిరాముఁడై
వెన్నెలలీను నీతొగల ♦ విందు గురుండయి గూడ హారపుం
జెన్నునఁ గ్రాలి కరాగ్రముల ♦ చే నిది మంచిచెడ్డయం
చెన్నఁగనీని చీఁకటుల ♦ నీరిక లెత్తఁగఁ జేసె నామదిన్.

తప—(తనలో) మూఢహృదయమా! అతఁ డస్మన్నామధేయ ముచ్చరింపకపోయిన మాత్రముననే చాల నుద్యుక్తవై యున్న నా కొకదురాశఁ గల్పించి నివారించెద వేల?

రాజు—మిత్రమా! చూడుము నాయవస్థ. శయనించుటకుఁగూడ శక్తి చాల కున్నది.

విదూ—(విషాదముతో) మందభాగ్యుఁడనగు నేనేమి చేయుదును? కర్ణపూర మైన నున్నచో నీతఁ డొకించుక యూరడిల్లి యుండును. దానిం గూడ ప్రమాదవశంబున మర్కటంబులపాలు జేసితిని.

మేన—(అభిప్రాయగర్భముగా) సఖీ! నమ్మికలేనిదానా! నీయం దుదాసీనుఁడే యైనచో నీకర్ణపూరముచే నీతని కూరట గలుగు టెట్లు?

తప—తనదేవి ననునయించుచు "నీ యపరాధమున కద్భుతరసమే కారణ" మని హస్తిపురోద్యానమున నాతఁ డన్నవాక్యము నీవు వినలేదా?

మేన—చతురము లగునర్మోక్తులం దెలిసికొనుటకు నీ వింకను జిన్నదానవుగదా

తప—ఇది యటుండుఁగాక "కేవలము విస్మయముచేత నేనాకర్షింపఁ బడితిని. వేఱు కాదు" అని విజనప్రదేశమందుఁ దనవయస్యునితో నీతఁడు చెప్పియుండ లేదా? ఇదియు నర్మోక్తియా?

మేన—పురుషు లతిగంభీరమానసులు గదా? తమనూతనచాపలము మిత్రులకడ గూడఁ మఱుఁగుపఱుపఁ జూతురు.

రంభ—బ్రాహ్మణునివలన మనకీ కర్ణపూరము వచ్చుటనిశ్చయముగ దెలిసినది. కావున దీనిని దీనుఁడగు నావిప్రుని కిచ్చెదను.

(విదూషకునిముందుట వైచుచున్నది.)

# తృతీయాంకము.

విదూ—(చూచి విస్మయముతో) దండకాష్ఠయుక్తమగు బిన్నద
పూరంబును దలఁపనితలంపుగా వచ్చి పడినది. భీతము లగువానరము
లెచ్చటనో డాఁగి యుండి దీనిఁ బడవైచి నట్లు దోఁచు చున్నది.

రంభ—పోరా! గ్రామీణకా! బ్రహ్మచారీ! నీవ క్రోతివి.

రాజు—(మందముగా దృష్టిఁ బ్రసరింపఁ జేయుచు) మిత్రమా? దీనిని నాకొ
దపై బెట్టుము. (విదూషకుఁడు దండకాష్ఠమునుండి విడదీసి కర్ణపూరము
రాజు నెదపై నుంచును.)

మేన—సఖీ! యిప్పుడైన నమ్ముము.

రాజు—(తెలిసికొని తిరస్కారపూర్వకముగా) ఎవరిదీ కర్ణపూరము ? అవ్వల
బారవైవుము. (విదూషకుఁ డట్లు చేయును.)

తప—[తనలో]అయ్యో చెడితిని గదా ! [ప్రకాశముగా]ఇఁక నేమి విందును

మేన—కర్ణపూరము నీదికా దనుకొని యాతఁ డిట్లు బారవైచెనని తలఁచెదను.

తప—[రోషముతో] పూర్వము " నీకర్ణపూరముచే నీతని కూరటకలుగు"
నని చెప్పితివి. ఇప్పుడు " నీదికాదనుకొని పారవైచె " నంటివి.
ఆహా ! నీ కీతని యందేమి పక్షపాతము. [పోవ నుంకించును.]

రాజు— గీతమాలిక.

నిర్దయా తపతీ ప్రియా ! ♦

మేన—ఆత్మావమానినీ! పోదము రమ్ము.

తప—నీదుసంశయం బుడిగె నిప్పుడో హృద♦ యంబ! వినుము

రాజు—ఆర్తిఁ బొందెదఁ గదవె చం ♦ ద్రాతపమున

తప—దైవము ! హతాస్మి

రాజు—రవిజని ♦ దాఘమందు

తప—అలరుమా! హృదయము!

రాజు—కల్వ ♦ కొలనుభంగి

తప—సుకృత మొనరింప నైతినో ♦ సకియ! నేను. 10

రాజు—[నిట్టూర్పు విడిచి దైన్యముతో] ప్రియా! నీసఖి యుచ్చరించిన సంవరణశబ్దమున కర్థము వేరైనను నీవు,

చ. కలఁగినధైర్యవృత్తిమయిఁ గ్రాలుచునల్లపు "డార్యపుత్ర"యం
చలికులవేణి! కొన్నియమృ ♦ తాంచితవర్ణములొప్పుమాటలన్
బలికితి గాదె? యిప్డుకరు ♦ ణామతి నాదగుగాత్రమందు నీ
లలితకరాంబుజం బునిచి ♦ ప్రాణములన్ నిలుపంగఁ బోలదే.

తప—(సాభిలాషముగా రోమాంచమొప్పఁ దనలో) అమ్మయ్యా! శేసే కదా యీతని కామమునకు హేతువు. [సంతోషవశంబున మూర్ఛిల్లుచున్నది.]

మేనక—[సహర్ష బాష్ప గద్గదముగా] సఖీ! మూర్ఛిల్లుము. మూర్ఛిల్లుము. నా కిష్టమే.

రంభ—[సంభ్రమముతో నాత్మగతము] సఖీ! ఏమి నీమోహము! [మేనకతో] సఖీ! నెచ్చెలి ఖేదమొందుటకు బదులు మూర్ఛిల్లుచున్నది. దీని నూరడింతము. [ఇద్దరు సమీపించి] ఊరడిల్లుము. ఊరడిల్లుము. ప్రియసఖీ! [తపతి మూర్ఛఁ దెలిసి ప్రేమవిశాలములగు చూపులతో రాజుం దిలకించుచున్నది.]

రాజు—[అస్పష్టముగా] మిత్రమా!

క. కుదురుఁ దొలంగి మదసువులు
మెదలఁ దొడంగెడిని గళస ♦ మీపమున, సిదే
వదలెడి గాత్రము, నిఁక నా
సుదతి మదక్షులను బడెడి ♦ చో వ్వొనరుపుమా! 12

విదూ—[తత్తరపడుచు సశ్రుగద్గదముగా] హా! చెడితిని. చెడితిని. నాయందు దైవోపక్రమ మిట్లు గాఁబోలు. [సత్వరముగా సమీపించి రాజునంగముల స్పృశించును.]

రాజు—హా! ప్రియా! [అని యర్ధోక్తియందే మూర్ఛిల్లును.]

విదూ—[విషాదముతో] మిత్రమా! యూరడిల్లు మూరడిల్లుము. [పరిశీలించి విషాదముతో] మిత్రుఁడు గతించెనా యేమి! [తలఁ గొట్టుకొనుచు] హా! వయస్యా! సకలధరామండలైకనాథా! హా! మదకారణబద్ధస్నేహా! సర్వకాల సహచరుఁడును బాలమిత్రుఁడును ననన్యశరణ్యుండను నగు నన్నేల విడనాడి పోయెదవు? దీర్ఘాయుష్మంతుండును వంశకరుండునగు పుత్రునిం బడయుము మని యాశీర్వదించిన సిద్ధదేశికుల వాక్యముగూడ వ్యర్థ మయ్యెనా? ఇఁక విలాపముతోఁ బనియేమి? భృగుపతనమునఁ బ్రియమిత్రు ననుసరించెదను. [నిష్క్రమించు చున్నాఁడు]

తప—(ఖేదమోర్వఁ జాలక భూమిపైఁ బడుచు) ఆహా! ఆర్యపుత్రుఁడు నన్నే పలవరించి గతించెను. ఆర్యపుత్రా! నేనును వచ్చుచున్నాను. ఇంచుక నిరీక్షింపుము. (మూర్ఛను బొందు చున్నది.)

సఖులు—(సంభ్రమముతోఁ దొడపై నునిచికొని) ప్రియసఖీ! యూరడిల్లు మూరడిల్లుము.

తప—(యూరడిల్లి) సఖులారా! పతివధపాపమలీమస నగు నన్ను ముట్టకుఁడు ముట్టకుఁడు. పరలోకగతుఁ డగు నాతని ననుసరించుటకు నాకు సెలవిండు.

రంభ—(చింతించి) సఖీ ! ఆహా యేమి మనమాధ్యము ! నీ కర కమలసంసర్గ మభిలషించి యీమహారాజీయవస్థఁ బొందెను. కావున నీతని హృదయంబుపై శీఘ్రముగ నీ కరకమలముంచుము. ఇదిగూడ విఫలమైనచోఁ బిమ్మట నందఱ మొక్కసారియే పోదము.

(తపతి సత్వరముగాసమీపించి తిరస్కరిణి నపనయించి
ససాధ్వసకంపముగా నతనియురమునఁ
గరతల మిడుచున్నది.)

రాజు—(శీఘ్రముగా లేచి చేయి వెనుకకు దీయుచుండఁగాఁ దపతిఁజూచి)

గీ. నన్ను బ్రదికించుటకు నీవు • నాయురమున
నిడినయీసుధాపూరంబు • లెసఁగుపాణి
వెనకకుం దీయఁ బోకుమీ • వినుతగాత్రి !
మత్కరంబున నునిచి స • మ్మదముఁ గూర్పు. 13

(గ్రహింప నుంకించును)

{ తపతి లజ్జతో సఖులఁ దిర్యగ్దృష్టులం జూచు చున్నది. }

మేన—(రాజును సమీపించి) మహారాజా! త్వరపడకుఁడు త్వరపడకుఁడు. ఈమాప్రియసఖి త్రిలోకప్రదీపకుండగుభానుని పుత్రి. భగవతియగు సావిత్రికిఁ జెల్లెలు. పేరు తపతి. భాను సంకల్పము గూడ నల్లుడు మహారాజు గారనియే కావున దేవు నారాధించి యీపె కరగ్రహణ మొనరింపుము. నీ యవస్థం జూచి నీచెలికాఁడు నిరాశఁ జేసికొని భృగుపతనమునకై వెడలిపోయెను. కావున శీఘ్రముగఁబోయి నాతని రక్షింపుము. మేము పోయివచ్చెదము. పునర్దర్శనము కుఁ గాఁక. (సఖులతోఁగూడ తపతి నిష్క్రమించును.)

రాజు—(సంభ్రమముతో మండపము నిర్గమించి పోయి) ఎక్క డెక్కడ నా చెలికాఁడు ?

విదూ—(ప్రవేశించి) స్నానసంశుద్ధుఁడ నగు నేనిఁక కర్తవ్యమునకుం గడంగెదను.

రాజు—(శీఘ్రముగ సమీపించి) సాహసింపకు సాహసింపకు. ఇదిగో ! నేను ప్రాణములతో నున్నాఁడను.

విదూ—(విని సంభ్రమముతో) ఎచ్చట నెచ్చట నున్నాఁడవు? బాష్పాంధదృష్టినగు నేను నిన్నుఁ గనఁజాల కున్నాఁడను. (కౌఁగలించుకొని రోదించుచు) ఈజన్మమందే మరలనిన్నుఁ గౌఁగిలించుకొను భాగ్య మొదవె.

రాజు—మిత్రమా! దుఃఖింపకుము. వ్యసనాంబుధిం గడచితిమి.

విదూ—ఎట్లు?

రాజు—ఇట్లు—(అని చెవిలోఁ జెప్పును.)

విదూ—(హర్షముతో) దైవకృప నీయందుఁ బూర్ణముగ నున్నది. ఇఁక మనము చేయవలసినదేది?

రాజు—వేఱేది గలదు?

గీ. ప్రణతవత్సలుఁ డైనట్టి ♦ పద్మహితుఁడు
క్రియల నెద్దాన మిగుల సం ♦ ప్రీతి నొంది
తనయ నివ్వాక వెలిఁవు లే ♦ దని దలఁచును
పుట్టిపని నిష్ఠ తోలుదొ త్త ♦ నాచరింతు. 14

(అని నిష్క్రమింతురు.)

తృతీయాంకము.

సంపూర్ణము.

---

ఓం

# తపతీసంవరణము.

## చతుర్థాంకము

{ చేటి యొకగిన్నెఁ జేతఁ బట్టుకొని ప్రవేశించుచున్నది. }

చేటి—"సఖీ! సౌగంధిక! తుమ్మెదలారగింపని పూఁదేనియలఁ గొనిరమ్ము" అని భర్తృదారిక నా కాజ్ఞ యొసంగి యున్నది. కావున నిచ్చట వెదకెదను. (పరిక్రమించి చెట్లపై దృష్టులు నిగుడ్చి) ఈ కల్పలత యందలి బంగారు తామరమొగ్గ మూతికడ నించుక విరిసి నట్లగపడు చున్నది. అందుచే నిందు మధుకరములకుఁ ప్రవేశము దుష్కరము. కావున దీనిని గ్రహించెదను. (అనిగ్రహించుట నటించును) ఆహా! యేమి యీమధుపేశలత! అపుడే గిన్నె దాదాపుఁగానిండవచ్చినది. (మరియొకచోఁ జూచి) ఈమందారవృక్షము నందలి కనకకర్ణికార కుసుమము వికసించి యున్నను లేమావిచిగుళ్ళు కప్పియుండుటం జేసి మధుకరముల కిచ్చటంగూడ ప్రవేశము దుష్కరమే. (అని కోయ్మ వంచును.) (అంత నా కౌశేయాసమున బరణి పట్టుకొని మతి యొక చేటి ప్రవేశించుచున్నది.)

చేటి—ఇది తపనవనము. ఇచ్చట దిగియెదను. (దిగుట నభినయించి ముందు నకుం జూచి) ఓహో, యిది ప్రియసఖి యగు సౌగంధికా! సఖీ సౌగంధిక! యిచ్చట నేమి జేయు చున్నావు?

ప్రథ—(చూచి) ఓహో జాంబూనదికా యిది! సఖీ! రతిపూజకుఁ బూఁదేనియలు సంగ్రహించుచున్నాను. నీ విప్పుడెక్కడనుండి వచ్చితివి?

ద్వితీ—దేవు నుద్దేశించి మహారాజుగారిప్పుడు తపస్సుఁ జేయ నారంభించెనో యప్పుడు భగవతి యగు యమునాదేవి చెంతకు భర్తృదారికయొక్క కుశల వృత్తాంత మెఱింగించుటకై నేఁ బోయి యుంటిని.

ప్రథమ—తరువాత,

ద్వితీ—అక్క యగు యమునకుఁ ద్రైలోక్య మూల్యానురూప మగు హార మొకటి గలదు. దానిని తా ధరించుకొని గంగాహర సేవనార్థమై కైలాసమున కేఁగుచుఁ దా మరలి వచ్చుదాఁక వేచి యుండి దానిం గొనిపోయి భర్తృదారిక కిమ్మని నన్నింతవరకు నామె నిల్పినది. ఇప్పుడు నే నాహారముం దీసికొని వచ్చితిని. కావున నిచ్చట జరిగిన వృత్తాంత మంతయు నాకెఱిఁగింపుము.

ప్రథమ—చెప్పెదను వినుము. మహారాజుగారు ద్వాదశవాసరనియమమును బూని యుండఁగా భగవానుఁడగు వశిష్ఠుఁ డాతనిని నియమమునుండి నివర్తింపఁ జేసి భర్తృదారిక నడుగుటకయి భగవానుఁడగు సూర్యుని కడ కేఁగెను.

ద్వితీ—తరువాత,

ప్రథమ—పిమ్మట భగవానుఁడగు రవి యనుమతంబున మహర్షి భర్తృదారికం గొనివచ్చి మహారాజుగారి కిచ్చెను. పిమ్మటఁ గొన్ని దినంబులకు గర్భముఁ దాలిచి కుమారనిభుఁడగు కుమారుం బ్రసవించినట్లు భర్తృదారిక యొక స్వప్నముం గనెను. ఇచ్చట జరిగిన వృత్తాంత మిది. (అని గిన్నె లోపలఁ జూచి) ఇప్పుడీగిన్నె నిండియున్నది. కావున నిఁక భర్తృదారిక కడకుం బోవుదము రమ్ము.

(అని యిద్దరును నిష్క్రమింతురు)

{ అంతట రాజు లలిత వేషధారియై
విదూషకునితోఁ బ్రవేశించును. }

రాజు—(స్మృతి నటించి యానందముతో) ఆహా! మన్మథవ్యాపారములు మరవబోధరసాంతరములు గదా! అట్లే,

సీ. తెం పొకింతయు లేక ♦ తెఱవ హస్తం బొడ్డి
పైకొనం బోవ తాఁ ♦ బ్రతిఘటించు
ప్రారంభమున నైనఁ బ్రతి ♦ షేధజల్పముల్
శారదాబ్జాలోక ♦ నల్పుచుండు
లజ్జాభరముచే వి ♦ లాసానురాగముల్
పల్లవాధర బయల్ ♦ బఱుప వెఱచు
రతివాంఛ గారింప ♦ రమణీశిరోమణి
మదిలోనె నిరతంబు ♦ మలఁగుచుండు
గీ॥ నీవి సడలింపనీయదు ♦ నీలవేణి
యిట్లు ప్రతికూలరీతిఁ బం ♦ చేషుకేళి
నతివ జరియించినను గూడ ♦ నట్టిరతిని
మఱువ వాంఛింప దింత నా ♦ మానసంబు.

విదూ — అట్లయినఁ గామరసమును భోజనరసమును నొకజాతిలోనివే. భోజనరసమువలె గామరసమును దుఃఖలబ్ధమైనపు డిచ్చునంత సుఖమును సుఖలబ్ధమైనపుడీయఁజాలదు. ఈవిషయ మేల పోనిమ్ము. అద్దమువలె నీదృష్టిని జక్కఁగాఁ దుడిచి నాయీలలితబ్రహ్మవర్చస్సౌభాగ్య రూపముం జూడుము. ఇదిగో బంగారు జన్నిదము చూచితివా? దీనినొక సంతానవృక్షమునుండి గ్రహించిధరించితిని. ఇంకొకదానినుండి యీ హేమదండకాష్ఠము సంపాదించితిని. ఒకానొకవానరము నాబ్రహ్మసూత్రమపహరించుటం జేసి నేనింతవఱకును మనస్సును బ్రహ్మసూత్రసహాయమున నిత్యకర్మల నెఱవేర్చుచుంటిని. ఇదిమొదలింక యథావిధిగా ననుష్ఠాన మొనర్చెదను. (రాజుముఖముం జూచి) ఓహో! నేను కనులు మూసికొని మాటలాడుచున్నాఁడను. నీ వెద్దియో విషయమాలోచించుచుండ నే నెద్దియో ప్రేలుచుంటిని.

రాజు — చక్కఁగా వచించితివి. ఈసఖీవియోగమునఁ గేవలము హృదయమే కాదు పరితపించుట,

క. స్తనకల, శాంగా, ధరములఁ
గనఁ జాలమి నాయురంబుఁ ♦ గనులు వదన మూ
వనితావియోగవిక్లబ
తను ద్రుటియును సైఁపలేక ♦ తలఁకెడిని సుమీ!

విదూ — వివాహమునకుఁ బూర్వము సంగమమో సంగమమో యని యొక యేడుపు. ఇప్పుడుమఁబల విరహమో విరహమో యని యీయేడుపు. కావున నీకు సంసారబాధ చాలదుస్సహముగానున్నది. (చెవియొగ్గి) మిత్రమా! పరితపింపకుము. కలహంసనాదము కమలసామీప్యమును సూచించునట్లు లీనూపురధ్వని దేవిగారు సమీపగతయైనట్లు సూచించుచున్నది.

{ అంతఁ దపతియు మేనకయు సపరివార సహితముగా బ్రవేశింతురు. }

తపతి — సఖీ! నే నతిసాహస మొనరించితినిగదా! కైసేఁతసందడింబడి యార్యపుత్రునిఁ జూడక యీకాలము వేయి యుగములనువలె గడిపితిని అలంకారమైనను ముగియకున్నది. పోనిమ్మెట్లయినను సరే యార్యపుత్రుని దర్శనోత్సవమునకై నాహృదయము త్వరపడుచున్నది. కావున నార్యపుత్రుఁడిప్పు డెక్కడ?

మేనక — ఈకరకతలోదకతీరమునందలి మందారలతామండపమునందు చెలికానితోఁ గూడి కూర్చుండి యిటే చూచుచున్నాడు. కావున రమ్ము. ఇటు నిటు.

(పరిక్రమింతురు.)

రాజు — (తపతిం జూచి విదూషకునితో) మిత్రమా!

గీ. అరుణబింబాధరమ్ముదై ♦ చావనిజ
భవమనోజ్ఞాంశుక హరిత్ప్ర ♦ భానిచయము

నరుణమృదుకరము లమర ♦ గురుపరిజన
సంగతయుఁబోలె దరిసె శు ♦ భాంగి దేవి.

తపతి—(సమీపించి) జయ సూర్యపుత్రా!

మేనక—జయము మహారాజా!

(నమస్కరింతురు.)

రాజు—(లేచనొత్తి తపతింజూచి)

గీ॥ అంగముల నెల్లఁ బ్రసరించు ♦ నట్టినీదు
స్తనభరస్పర్శయనెడి సు ♦ ధారసంబు
గ్రాలఁ, దనుమధ్యనన్నిటు ♦ కౌఁగిలించి
ప్రమద మొసఁగుమునాదుగా ♦ త్రముల కిపుడు.

(అని కౌఁగిలించి) సఖీ మేనకా! యాసన మలంకరింపుము.

మేనక—చిత్తము మహారాజా!

(అందఱును గూర్చుందురు)

రాజు—(మేనకం జూచి) నెచ్చెలి రంభ రాకున్న దేల?

మేనక—మహారాజా! యెద్దియో కార్యాంతరమున భగవతియగు సావిత్రికడ కేఁగినది.

విదూ—(తపతీముఖముంజూచి సంభ్రమముతో) మిత్రమా! అనుచరసమూహం బులతోఁగూడ చికిత్సకులుం జనిరా?

రాజు—ఇపుడు చికిత్సకులతోఁ బని యేమి?

విదూ—దేవిగారికి పాండురోగము సంభవించినది. పూర్వము కామోద్రేకమని చెప్పుటకు వీలుండెను. ఇపుడు నినుఁగలసి యుండియు దేహమెల్ల పాండురమై యుండ నేల?

రాజు—వ్యాధి విశేషము తెలుసుకొనుటకు నీకంటె సమర్థుఁ డెవ్వడును లేఁడు. మూర్ఖా! ముక్తాహారకాంతులం జూచి నీవు భ్రమించుచున్నాఁడవు.

విదూ—(నిరూపించి) సరే నిజమే (మేనకం జూచి) అమ్మా మానవ చాపల మునకన్న బ్రాహ్మణచాపలము రెండు మడుంగు లధికము కావున నిన్నొ కటి యడుగఁ దలఁచితిని. దయచేసి యానతిమ్ము. ఈవిస్మయనీయ మగు హార మెక్కడ నుండి వచ్చినది.

మేనక—పాంచజన్యమున జనించిన ముత్తియములచే రచియింపఁ బడిన యీ హారమును ముకుందుఁ డాత్మచరణ సంభూత యగు గంగాదేవికిచ్చెను. ఆమె దానిని తన సఖియగు యమునకిచ్చెను. యమునాదేవి తనచెల్లె లగుతపతికిం బుత్తెంచినది. అది యీ హారము.

రాజు—భానుతనయా! యీ హారము చిరకాలమునకుఁ దన కుచితమైన స్థానమును బొందినది. మఱియును,

చ. స్తనసరసీరుహంబులకు ♦ దగ్గరచుట్టము నాఁగనొప్పు నీ
ఘనసితహారకాంతిఝుర ♦ కాండము కోకిలపక్షమాలరీ
తి నసితమౌ నభమ్మున ♦ నతిస్ఫుటమై విలసిల్లుచుం బయో
ధినిఁ బ్రసరించు దైవతన ♦ దీఝురకాండముభంగిఁ దోఁచెడిన్.

(నేపథ్యమున)

గీ. తేనె, సుమములు, ధూపముల్, ♦ దీపవితతి,
గంధ మాదిగ నుచితోప ♦ కరణము లివె
చేర్పఁ బడియెను రతిపూజ ♦ సేయఁ దటి యి
దే యనుచు వేగ దేవికిఁ ♦ దెలుపవలయు. 6

తపతి—హా! (అనిస్మృతి నభినయించును.)

రాజు—సఖి మేనకా! యిదియేమి?

మేన—మహారాజా! చిత్తగింపుడు. దేవరవారి సంగమమునకుఁ బూర్వముభగ వతియగు రతీదేవినిఁ గూర్చి నెచ్చెలి ప్రార్థించి 'ఆర్యపుత్రునిసంగమము నాకెప్పుడు లభించునో యప్పుడు మధుకరము లానని పూఁదేనియలు నీకు సమర్పించెదను' అని చెప్పెను. సంగమ సుఖలోలయై సఖియింత

వలెను నావిషయము మఱచినది. అందుచేతనే యీయారంభ మంతయును.

రాజు—(తపతి ముఖముం జూచినవ్వుచు) ఈ యారాధనక్రమము చాల లలిత మైనదే. కాని యందించుక విపరీతము గూడ నున్నది.

చ. వరనిచయప్రదానగుణ ♦ వారవిభాసిని వాట సిన్నె తా
వరముల నిచ్చెకుందగిన ♦ వానిని వేఁడుటబోలుఁ గాని యా
త్మరమణు నీశనేత్రజని ♦ త జ్వలనంబునఁ గోలుపోయి దు
స్తరపరితాప మొందురతి ♦ తానెడఁగూర్చునె నీకుఁగోరికల్

తపతి—ఆర్యపుత్రుని ముఖము నక్షత్రక్షుల కు నివాస భూమియే కదా!

మేన—ఇంకఁగాలక్షేపము సేయుట తగదు. కావున మహారాజుగారనుజ్ఞ నిత్తురు గాక.

రాజు—ప్రియా! సరే నీనిక్షేత్రణయము నిర్వర్తించి కొనుము.

విదూ—మంచిదే యాశీర్వచనకాలమెప్పుడు తటస్థించునో యప్పుడు బ్రాహ్మణుఁడు సంపన్నుఁడని తలంపవలసినదే.

మేన—మూర్ఖా! ఈవిషయమున నీ ప్రచారమే మున్నది?
(రాజు ముఖమునుండి దృష్టుల నెట్లో వెనుక మరల్చి పరివారముతోఁ గూడ తపతి నిష్క్రమించుచున్నది.)

రాజు—వయస్యా! కాంతా వియోగముచేఁ బాధకిరుచున్న యీ కాలమిప్పు డేవినోదములచేఁ గడపి పుచ్చుదును?

విదూ—(నిర్వేదముగా) నిర్మానుష్య మగు నీజీర్ణాటవీమధ్యమున వినోద మేముండును? కావుననొక్క విషయము మాత్ర మాలోచించు కొనుము. రాక్షసులయొక్కయు వ్యాఘ్రములయొక్కయు నోటఁబడకుండ తప్పించికొనినప్పుడు మాత్రమే సంతానవృక్షములఁ జుట్టుఁ దిరిగి భిక్షమెత్తి కొనుటకు మనకు వీలగును.

[అంత భీషణవేషముతో రాక్షసి ప్రవేశించుచున్నది.]

రాక్షసి—(సరోషముగా)

గీ. మిగుల రోసంబు నాకిదే ♦ మెఱమెత్తె
మాయలను ఘోరదండసం ♦ పాతములను
గ్రూరుడగు సంవరణుని శ ♦ రీర మిపుడు
బ్రద్దలొనరింతు సలిలకుం ♦ భమును బోలె. 8

సంవరణుని బాణములచేఁ బ్రాణంబులు గోల్పడిన రాక్షసుల బంధుగులందఱు నన్నుఁ జేరి "సఖీ మోహినీ! నీమాయాబలముచేత నెట్టియైన ఋషికుల శరణ్యుండును, రాజాపశదుండును నగు సంవరణునిఁ బట్టికొనిపోయి సముద్ర మధ్యమునఁ బడఁద్రోసి చంపుము" అని యిపుడు నన్ను సవినయముగాఁ బ్రార్థించిరి. నానూఱుమంది పుత్రులాతనిచే మడియుటం జేసి నాకును గ్రోధసుగ్గలమై యున్నది. కావున నాసఖులయొక్క నియోగము నెఱవేర్చుటకు నిశ్చయించికొంటిని. ఇఁక నిచ్చట వానిని వెదకెదను. (పరిక్రమించి చూచి) యిదిగో! యెవఁడో యొక బ్రాహ్మణుంగూడి యీసంతానమండపమునఁ గూర్చుండియున్నాఁడు. (చెలిమటునాటము) ఈబ్రాహ్మణుం దిలకించి నాదంతములు కరకర లాడు చున్నవి. నోరూటలూరుచున్నది. ఏమిది! ఈతపోనుభావు నెదుట నీకుట యుండ నావిషయమును దలఁ బెట్టుటకైన సాధ్యముగాకున్నది. ఇఁకఁ దినుట యెట్లు సంభవించును? కావున నిట్లొనర్చెదను.

(అతిరమణీయరూపయై రాజును సమీపించుచున్నది.)

రాజు—(చూచి విస్మయముతో) మిత్రమా! చూడు చూడు.

గీ. దిబ్బపిఱుఁదులు నెఱికొను ♦ గుబ్బచనులు
వెడఁదకన్నులు నసియాడు ♦ వేనలియును
గ్రాల, మరుడను విలుకాని ♦ కోల యనఁగ
వచ్చె నిటకుం డిదియొ యొక్క ♦ వన్నె విటకు. 9

విదూ—ఈ యరణ్యమున వంచనశీలరగు స్త్రీలు ప్రచ్ఛన్నవేషముఁ జరించు చుందురు. ఇదెద్దియో నాకుఁ దెలియకున్నది.

రాక్షసి—(విని విషాదముతోఁ గంపము నొందుచు) వంచనశీలరము చున్నారే. యిదియెట్లు? ఈతఁడునన్నుఁ దెలిసికొనెనా యేమి? నామనోరథము భస్మాయమాన మయ్యెఁగదా?

రాజు—అట్లనకుము. కాంతలందఱును విప్రలంభశీలరే యగుదురా?

రాక్షసి—(హర్షముతో) దైవవశమున నన్నుద్దేశించి యితఁడీమాట ననలేదు (సమీపించి) జయము మహారాజా!

రాజు—పూజ్యురాలవగు నీకు స్వాగతము. నీవెవరు? ఇచ్చటికరుదెంచుటకుఁ గారణమేమి?

రాక్షసి—చిత్తగింపుడు మహారాజ! చిత్రరథుఁడనుగంధర్వరాజునకు గగనమాల యాని యప్రతిమానసౌందర్యరాశియగు నొకకూఁతురుగలదు. నేనామె సఖిని. సుమనావతియనుదానను. అనేక దేవాసురసంగ్రామవిజయులగు దేవరవారిగుణగణములను విని మిముజూచువేడ్క హృదయంబునఁ జివురొత్త నాసఖినన్నుఁగలసి హస్తిపురమునకొకప్పుడువచ్చియుండెను.

రాజు—తరువాత,

రాక్షసి—అనంతరము కార్తికేయావాసపరిసరారామమున నాసఖియొక్క పాదచిహ్నములను గామలేఖను గర్ణపూరమును దేవరవారనురాగ పూరితములగు దృష్టులతోఁ జూచు చుంటిరి. అదిగని నాసఖి నెమ్మనమున సమ్మ్రలికంబొంది పితృపరాధీనయగుటంజేసి చేయునదిలేక తన నగరమున కేఁగెను.

రాజు—(విదూషకునితో జనాంతికముగా) మిత్రమా! పాదచిహ్నముల యొక్కయుఁ గర్ణపూరముయొక్కయుఁ బరిణామమిట్టిది. తెలిసినదా?

విదూ—సరే కానిమ్ము. మరల నిప్పుడధికమ్ముగఁ గమ్మతావు లెటనుండియో వచ్చి ఘ్రాణేంద్రియములకు పర్వ మొనర్చుచున్నవి. కావున మఱి కొందఱు దివ్యకన్యలు నిన్నుఁగామించుటకు వచ్చుచున్నారని తలంచుచున్నాఁడను.

రాజు—(రాక్షసిం జూచి) తర్వాత,

రాక్షసి — ఇప్పుడు నాసఖి దేవరవారిసంగమసుఖము తనకు సంభవింపదని దలఁచి భృగుపతనమునకు సిద్ధమాయెను. అప్పుడు నేనాశాజనకములగు వాక్యములంజెప్పి యెట్టెటో నివ్వర్తింపఁజేసి యిటకరుదెంచితిని. దేవర వారిప్పుడు సంగమానుగ్రహమొనర్పనిచో నామె నిశ్చయముగాఁ జని పోవును. నేనును సఖీమరణముఁ జూడఁజాలక యిప్పుడు మీసమక్షము నందే ప్రాణములు వదలెదను.

విదూ — (రాజుతో) మిత్రమా! యీదూత్యోపక్రమ మపూర్వముగా నున్నదే! బలాత్కారముచేతనా కామ ముత్పాదించుట?

రాజు — (స్వగతము) దీనివాక్యమును బట్టిచూడఁగా నామనస్సునకుఁగూడ నసంతుష్టిఁగనేయున్నది. కానిమ్ము, దీని నిట్లుబంపివైచెదను. (ప్రకాశముగా) శోభనవతీ! తమంతఁ దామ ప్రార్థించి వచ్చెడి యిట్టి స్త్రీరత్నములనుయేపురుషుఁ డభిలషింప కుండును? వేయేల?. బూజ్యురాలవగు నీమాట జవదాటము.

రాక్షసి — (హర్షముతో) దేవరవార నుగ్రహించుటంజేసి బ్రదికితిని. కావున నేఁటి ప్రదోష సమయమున మిత్రునితోఁ గూడ దేవరవారిచ్చట నేవేఁచియుండుఁడు. నేనప్పటికి విమానముం దీసికొని తప్పక వచ్చెదను. (అని నిష్క్రమించును.)

విదూ — మిత్రమా! ఏమి నీప్రయత్నము?

రాజు — నామనోవ్యాపారములు నీ వెఱుంగఁజాల కున్నాఁడవు. తపతీ గుణగణబద్ధమగు నా యీచిత్తవృత్తిని వేఱొకచోఁ జరింపఁ జేయ గలనా? కేవలము దాని సాహసమునకు వెఱచి నే నట్లంటిని. తపతీగాత్ర సంపర్కమున ధన్య మైనదని భ్రమపడి నే నిన్నాళ్ళీకర్ణ పూరమును బ్రాణపదముగఁ జూచుకొను చుంటిని. అన్యకాంతా కపోల సంసర్గోపహతంబగు దీని నిప్పుడవ్వలఁ బాఱవైవుము.

విదూ—(సవిస్మ)ఆహా! ఏమి యీరాజకులము నాశ్రయించువారికిఁ గలుగు పరిభవము. ఇంతవరకును మద్భుజాంతర వర్తియైన యీకర్ణపూరమునకు నిముసములో నవితర్కితోపద్రవము సంభవించినది. (కర్ణపూరమును బాఱవైచి) మిత్రమా! ఆశ్చర్య మాశ్చర్యము. ఆకాశ మీకర్ణపూరమును దిగమింగినది. మఱల నిది భూమిపై బడకున్నది.

(నేపథ్యమున)

మ. వసతాప్రాప్తివిహీనమర్త్యహితముక్షోభావిక విషాదప్రదం
బును నాకస్మికమైన యొక్క సమయంబుం గల్పనంజేసి నే
తనునమ్మించిన మాయలెల్ల భృగుసత్కర్మంబులందూ లెమో
హినికాఖ్యాసురిస్వాంగ మొందిచనెడిక్షోహీనీకృతారంభమై.

రాజు—[హర్షముతో] విమాన సమేతయై యా నాతివచ్చినప్పుడే తిరస్కార విధానమునఁ బంపివైతునా యని చింతించుచుంటిని. ఇంతలో నిదంతయు మాయాజాల ప్రభావమని వచించి దైవము మనల సంకటంబులనుండి యుద్ధరించెను.

విదూ—నేను నెట్లో దైవకృపచే నారాక్షసియొక్క దంష్ట్రికుఠారముల బారిఁబడకుండ బ్రదికితిని.

{ అంతటఁ గర్ణపూరముఁ జేతఁ బట్టుకొని పటాక్షేపమున మేనక ప్రవేశించు చున్నది. }

మేన—త్వరపడుము. త్వరపడుము. మహారాజా!

రాజు—[సంభ్రమముతో] ఏమి యేమి?

మేన—ఆరాక్షసి తననెచ్చెలి భృగుపతనవృత్తాంతము దేవరవారితో విన్నవించుటకుఁ బ్రారంభించినప్పుడు సఖి నాతోఁ గలసి యిచ్చటికివచ్చియుండి దేవరవారి సంకేతవచనము విని కోపము వహించి వెడలిపోయెను. నేనును బర్యవసానము నిరీక్షించుచుండి దేవరవారి కిప్పుడు

యథార్థము విన్నవించుకొనఁ గలిగితిని. కావున త్వరితముగఁ బోయి
తెచ్చెలి నూరడింతురుగాక.

రాజు—[విషాదముతో] ప్రేయసి యిపు డెచ్చట నున్నది?

మేనక—అదిగో చూడుఁడు. కల్యాణవాయునాలయమునఁ బ్రవేశించుచున్నది.
కావున త్వరపడుఁడు.

[అందఱు సంభ్రమముతోఁ బరిక్రమింతురు.]

[అంతఁ దపతి ప్రవేశించును.]

తపతి—(సప్రణామముగా) దేవా! రమావల్లభా! పూర్వము కామాగ్నిచేఁ
గ్రాగి నశింపనున్న నాశరీరంబుఁ గాపాడితివి. ఇప్పుడు మఱల పరిభ
వానలదాహమున నశింపనున్నది.

రాజు—(సంభ్రమముతో సమీపించి) ప్రేయసీ! ఇది యేమి? పరిభవానల
మనుచున్నావు?

తపతి—(బొమలు ముడిచి వెనుదిరిగి మరలిపోఁ బోవును)

రాజు—(చేలాంచలముఁ బట్టుకొని)

చ. అనయము నీవు నాయెడల నంచితరీతినిఁ జూపు ప్రేమవ
ర్తనముల తత్త్వముం దెలియఁ దథ్యముగాఁగ మదీయమానసం
బునకు నశక్యమే యగును పో! యిది యేల వహించెదీవు నీ
మనమున నీడులేని యవమానము ముగ్ధకురంగలోచనా.

మేన—సఖీ! కోపమొందకుము. (చెవిలో) ఇట్లు జరిగినది.

తపతి—కష్టా! నిష్కారణముగ నార్యపుత్రునిపై నపరాధము మోపితిని.
(రాజుంజూచి) ఆర్యపుత్రా! జయము.

రాజు—(సంతోషముతోఁ గౌఁగిలించుకొని) అనిమిత్తకోపశీలా! యీదాసు
నిపై నీకుఁగల కోపహేతువు లసత్యములును దుఃఖభాజనములు నైనవి.

మేన—(విదూషకునిజూచి) ఓయి రాజవయస్య! యాకాశముచే దిగమ్రింగఁ
బడిన నీకర్ణపూర మిదిగో! తీసికొనుము.

విదూ—(భయముతో) రాక్షసియొక్క కర్ణపూరము మాకు శుభంకర మైనది కాదు. కావున నే నొల్ల.

రాజు—(తపతి వినకుండునట్లు) సఖీ మేనకా! మాకు మర్మవ్యథఁ గలిగించుచున్నావు గదా!

మేన—మహారాజా! శంకింపకుడు. యీ కర్ణపూరంబును, బదయుగళంబును మా నెచ్చెలి యవియే.

రాజు—నా హృదయమున నాటియున్న సంశయశల్యము దైవకృపచేఁ జిరకాలమునకు నీచేఁ దొలగింపఁబడినది. (విదూషకునిం జూచి) మిత్రమా! కోపాంతరాయ రహితమగు ప్రియా పరిష్వంగమిది. కావున నీకర్ణపూరము స్వీకరింపుము.

విదూ—అట్లే (అని పుచ్చికొని దిక్కులు పరికించి) మిత్రమా! అకాముకులగు మాబోఁటివారు సంధ్యోపాసన మతిక్రమింప గూడదు గదా!

రాజు—(నల్దిక్కులం జూచి) మిత్రమా! చక్కఁగాఁ బ్రబోధించితివి. (తపతిం జూచి) ప్రేయసీ! నీవభ్యంతర మందిరముఁ బ్రవేశింపుము. మేమును,

గీ. ధాతృగాత్రముఁ దమమునఁ ♦ దప్పులనీక
ప్రోచుచుఁ ద్రివేదములకును ♦ మూలమగుచుఁ
దవిలి నిరుసంజ జపియింపఁ ♦ దగిన దగుచు
వెలయునీ సహజాతను ♦ గొలుతుము మిత్రుని. 21

(అందరును నిష్క్రమింతురు.)

చతుర్థాంకము

సంపూర్ణము.

ఓం

# తపతీసంవరణము.

## పంచమాంకము.

---

{ అంతట బద్ధకర్ణపూరదండహస్తుఁడై భయముతో విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు. }

గా—(నిట్టూర్పు విడిచి) అయ్యో! వంచింపఁబడితిని, వంచింపఁబడితిని. ఈ తపనవనమం దతిచిరకాలము విహరించియున్న వయస్యుఁడును, దేవియుఁ బరిజనంబును స్వప్నలబ్ధమగు నిధివలె ప్రభాతమున మేల్కాంచి చూచు సరికి నాకగపడకున్నారు. ఈ తపనవనమందంతటను వెదకితిని. మృగశకుంత జాలంబుల మాత్రము విడచి సర్వస్వమపహరించికొనిపోయినగత రాత్రిచేఁ దపనవనమును నేను నేలకో విడువఁబడితిమి. ఆశ్చర్యము! (సవితర్కముగా) దేవితోఁగూడి రాజు తపనలోకమున కేఁగియుండునా యనుకొన్నచో నాకుఁ దెలుపకయే యాతఁడట్లొనర్చి యుండడు. ఒకవేళ మాయాదక్షులగు రాక్షసు లెట్లయిన నీతనిఁ గొంపోయిరను కొందునా యది వారికి సాధ్యముగాదు. భృగుకర్మ ప్రభావముచే మాయ లిచ్చటఁ బ్రసరింపవు. ప్రత్యక్షముగనే పరాక్రమించియుందురనుకొన్నచో వారల నివారించుట కాతని ప్రభావమే చాలును. కానిమ్ము దురూహలచే నికఁ బ్రయోజనము లేదు. కావున తపనవనము విడిచి వేఱొక చోట వెదకెదను. (పరిక్రమించి దిక్కులు పరికించి) ఆహా! ఈవన గహన ప్రదేశమెంత భయంకరముగా నున్నది! కుంభస్థలము సింహ నఖాగ్రంబులచేఁ జీల్పఁబడుటంజేసి తనసహచరుఁడు రోదనము సేయుట

విని భయముచేఁ బఱువెత్తుచు మార్గమధ్యమున బోయలు గల్పించిన గుంటఁ బడి యీ కరిణి జాలిపుట్టునట్లుగ నేడ్చుచున్నది. (మఱియొకచోఁ జూచి) ఆహా! భల్లూకము వెనుకటి భాగమంతయుం దిని విడువ నాలుక వెడలఁ బెట్టి నిశ్చలోత్ఫుల్లలోచనంబులతో నిటబడియున్న యీకురంగాంగనం జూడ నిప్పుడును భయమగుచున్నది. క్రూరసత్వనిహతంబులగు దుర్బల మృగ కళేబరంబులచే నిండి దుర్గమంబై యున్న యీప్రదేశము దుర్భిక్షపీడితంబగు రాష్ట్రంబును బోలి యున్నది. వేయేల? భయవిధురం బగు నాదృష్టియే యిచటఁ బ్రసరింపఁ జాలకున్నది. ఇఁక నడుగులస్థితిఁ జెప్పనేల? పురవీధుల నేని యొంటి బోవ వెఱచు నే నీయరణ్యమం దెట్లు భయపడ కుండును? సహాయులా లేరు. కావున నాకిఁక శరణ మెద్ది? దిక్కెవరు? (భయకంపితుఁడై దండ కాష్ఠము నూఁతఁగా గొని నిలుచును.)

{ అంతట నమాత్యుఁడు ప్రవేశించుచున్నాఁడు. }

అమా — (సవితర్కముగా) ఆహా! కామ మెంతనీచ మైనది. ప్రసిద్ధప్రభావుండును నిసర్గవినయ సముద్భవ శేముషీ ప్రశమితప్రకోపద్రవుండును నగు మహారాజుగూడ నీకామమునకు లోనై స్వరాజ్యము విడచి యింత కాలమును యీమహారణ్యమునందు నివసించుచున్నాఁడు. ఇఁక రాజ్యమన్ననో చిరకాలము నుండియుఁ బర్జన్యునిచే నిరాకరింపఁబడి యున్నది.

సీ. ఏవంకఁ జూచినఁ ♦ బ్రేవుల ప్రోవులు
చిత్తభీకరములై ♦ జెలఁగుచుండె
ఘోరమైనట్టి శి ♦ వారావభారంబు
కర్ణరంధ్రంబులఁ ♦ గాడుచుండె
భూతభేతాళసం ♦ ఘాతంబు చెలరేఁగి
తిరుగాడఁ జొచ్చె నల్ ♦ దిక్కులందు

నర శిరంబుల విశా ♦ లమ్ము లెమ్ముకలు మేది
నీ భాగమంతట ♦ నిండి యుండె

గీ. ప్రజలు వెఱగంది మిగుల దూ ♦ రంబు సనిరి
యీదృశాపత్స్థలం జిక్కి ♦ యిపుడు చూడ
సంహరణచక్రవర్తి రా ♦ జ్యంబు భయద
మయ్యెఁ గాళీమహోగ్రకా ♦ యంబు భంగి

అభిమత కాంతాయుక్తుఁడైన మహారాజుగారికి తపనవన మను నొకా నొక దేవారణ్యము విహారభూమి యనివింటిని. కావున తపనవన మెచ్చట నున్నదో వెదకి కనుగొందును గాక. (పరిక్రమించుచు ముందు జూచి) ఓహో! దేవరవారికి బహిఃప్రాణ మగు నీపారాశర్యుఁడు దేనిచేతనో పట్టుపడిన వాఁడువలె గన్పట్టుచు నిచటనున్నాఁడు. ఈతని వలన మహారాజుగారి వృత్తాంతముఁ దెలిసికొనియెదను. (సమీపించి) మిత్రమా! సేమమా!

విదూ...(సంభ్రమముతో) ఓహో అమాత్యుఁడు వసుమిత్రుఁడా? ఏమి యీ మబ్బులేనివాన. (హర్షముతోఁ గౌఁగిలించికొని) రాజరహితంబగు రాష్ట్రంబు విడనాడి వచ్చితి విదేల? బలగర్వితులును మనకుఁ బూర్వ వైరులును నగు పాంచాలు రుపేక్షింపఁ దగువారలు కాదుగదా?

ఆమా...అతి క్షుద్ర పరాక్రమ వంతులగు పాంచాలురగొడవయేటి కటుండ నిమ్ము. ఇప్పు డతి భయంకరమగు క్షామ మాదేశము బీడించు చున్నది?

సీ. తిన నోగిరము లేక ♦ దినదినంబుచు జిక్కి
శల్యావశిష్టులై ♦ జనులు మృత వి
శేషులు కంఠాగ్ర ♦ సీమఁ బ్రాణములు మె
దల కను దీనాత్మ ♦ కులయి వలలు

గాలముల్ మూఁపున ♦ వ్రేలవైచి, తరలి
మత్స్యంబులం బట్టు ♦ మమత మీఱ
గంగయందలి లోఁతు ♦ గలయట్టి మడువుల
లో ప్రొచ్చి కుత్తుక ♦ లోఁతు నీట
గీ. మునిఁగి యుండగ నామిషం ♦ బునకుఁ దిరుగు
లాడు గ్రద్దలు వక్రంబు ♦ లైన వాడి
ముక్కులను వారి తలల పైఁ ♦ బొడుచుచుండుఁ
దటుకు తటుకున ఘోర శ ♦ బ్దంబు గాఁగ. 2

ప్రభు వచ్చుట లేమిం జేసి యిట్టి దారుణావస్థ సంభవించినది. కావున నేదో యుపాయమున నతనిని హస్తిపురికిం దోడ్కొనిపోవ వచ్చితిని. ఇప్పుడు మహారాజుగారెచ్చట నున్నారు?

విదూ—(నిశ్వాసముతో) మందభాగ్యుఁడను జెప్పెదను వినుము. ఇంతకాల మిచ్చటనే తపనతనూజం గూడి విహరించి గతరాత్రియందు నిదురించుచుండ నన్నిచ్చటనే విడిచి దివ్యజనసమూహముతోఁ గలసి గంధర్వ నగరమువలె నదృశ్యుఁడయ్యె. అందుచే నీకాంతారమంతయు వెదుకుచు క్రూరమృగంబులవలని భయంబున నేనిటనిలిచియుండ నీవువచ్చి నన్నుఁ గలసికొంటివి. ఇదంతయు నా యధన్యతాపరిపాకమే.

అమా—అట్లుగాదు. నాపై నిందారోపణ సేయఁబూని మాత్సర్యముచే మహారాజిట్లుపక్రమించె. ఏలయన,

గీ. వ్యసనమిత్రంబు లగు భూప ♦ రాత్మజాప
రాధముల నంతిపురపు మూ ♦ ర్ఖతను జేసి
యపనయమునను నా దోష ♦ మంతయు సచి
వాత్మమాలిన్యపరిపాక ♦ మగుఁదలంప. 3

(చింతించి) మహారాజుగారు నిజముఁగా నిన్నువిడచి దేవీసమేతుఁడై పోవఁడని నానమ్మకము. ఏకారణముననో యంతర్హితయైన దేవిని వెద

కుచు నీయరణ్యమందే తిరుగుచుండునని తలఁచెదను. కావున నాతని వెదకుదమురమ్ము.

విదూ...(స్వగతము) అహా! దేవియెంతనిర్దయస్వాంత! తనయుఁడను ఫలమునకుఁ బువ్వువును జూపినట్లైనూపి వెడలిపోయినది. (ప్రకాశముగా) అట్లే కానిమ్ము.

(ఇద్దఱుఁబరిక్రమింతురు.)

విదూ...(ముందుజూచి) ఈయిసుకనేలపై నెవ్వఁడో వనచరుఁడు నడచి నట్లున్నది. ఇదిగో యడుగుజాడ.

అమా...(సావధానముగా నిరూపించి హర్షముతో) చిరకాలమునకు నా నేత్రములు ధన్యములైనవి.ఇయ్యది మహారాజుగారిపదకమలముద్రయే. చూడుము.

మ. కలశంబియ్యది ఛత్రమయ్యది తురంగంబల్లదేయాయదే
జలజంబయ్యదియే పతాకమిదియే • శంఖంబుచక్రంబదే
భళిరే!కల్గునె లక్షణంబులివిభూ • పశ్రేష్ఠుఁడై సప్తవా
ర్ధిలసన్మేదినినేలు సంవరణు నంఘ్రింద్రక్క నన్యాంఘ్రిలన్

(నేపథ్యమున)

ఛీ! దురాత్మా! అచలాధమా! చిరకాలంబునుండి వెదకుచున్నను నాప్రాణేశ్వరిం జూపకున్నాఁడవు. విశ్వవిజయానంతరవిరమదైక్ష్వాకక్షోణీధరకార్ముకోద్వహనకర్మకరా! జనితబహుజన్యపౌరవరాజన్యచాపచక్రపరాక్రమవిశేషంబు లిప్పటికిని నీ వెఱుంగఁజాలకున్నాఁడవు. కానిమ్ము. సంవరణుఁడిప్పుడు బోధింపఁగలడు.

విదూ...(చెవియొగ్గి) దైవవశమున జలధరగంభీరమగు వయస్యుని స్వరము వినగంటిమి.

అమా...అహా! మహారాజుగారు తనప్రాణేశ్వరిని హిమవంతుఁడపహరించెనని తలఁచి యున్మత్తునిభంగి నతనిపైఁ గోపించుచు నిటేవచ్చుచున్నాడు కావున నతనిదర్శించుటకిది సమయముగాదు. తటి వేచియుండి సమీపింతము.

విదూ...అట్లే! (గుహాభ్యంతరంబున డాగియుండును.)

{ అంతట నున్మత్తుఁడగు రాజు ప్రవేశించుచున్నాఁడు. }

రాజు...(ఉద్వేగముతో 'ఆ దురాత్మ' యని పూర్వరీతినే పఠించి)

చ. హరుఁడు పురత్రయైకహరుఁ డల్లుఁడు దా శరణం బొసంగినన్
శరభవుఁ డాత్మజాతతను • జాతుఁడు నిన్ బ్రదికింప నెంచినన్
సురరిపువాహినీప్రకర • శోణితధారలఁ బుక్కిలించి బల్
బిరుసుగ నున్న నాదు శర • బృందము నిన్ విడనాడునే ఖలా? 5

ధనువు, ధనువు.

విదూ...(క్రిందపడి భయముతో) ఆహా! నన్నెవ్వఁడో పడఁగొట్టినట్లున్నది.

అమా...(విస్మయముతో) ఆహా! మహారాజుగారి ప్రభుశక్తి శక్రప్రభావము నతిశయించి యున్నదిగదా! గౌరీగురుండగు హిమవంతుఁడుగూడ నీతని కోపంబునకడలి కంపించుచున్నాఁడు. (విదూషకుని లేవనెత్తును.)

రాజు...(చింతించి) ఛీ! కృతఘ్నులం దేనగ్రేసరుండఁగదా! నాఁడు విరహార్తిచే నా ప్రాణములు పోవనున్న తఱిని మనోహారిణితోఁ జేర్చి నన్ను రక్షించెఁగదా యితఁడు. అట్టి యీ హిమవంతు నిప్పుడు నా బాణంబులకు లక్ష్యభూమిగా నొనర్చితిని. వేఱొకచోఁ వెదకెదనుగాక. (మఱియొకచోఁ జూచి) దేవా!

మ. సరసీజాక్షి! విలాససంచలితమో • హా భ్రూలతం బోలు నీ
విరివిల్లం సవసందుఁ జేర్చితుహినో • ర్వీభృద్వనశ్రేణి సం
చరణాసక్తుఁడవైతి, వెందయిన న • స్మత్ప్రాణతుల్యంబుగా
శరసారంగవిలోచన బగుపడా • ర్థంబౌంతునగప్పెట్టెనే? 6

రాజు—హాహాహాహా! ఛీ నున్మత్తుఁడఁగదా! శరీరింబోలె నీయనంగు నుద్దేశించి క్రేలఁ జొచ్చితిని. కానిమ్ము వేఱొకచోట వెదకెదను. (పరిక్రమించి

హర్షముతో) అహా! నా మనోహారిణి వోయిన త్రోవ గుర్తించితిని. ఏ కారణంబుననో కోపించి నన్ను విడనాడి పోవుచు,

గీ. శ్రమముచే దేవి ఇచ్చోట ♦ క్షణము సేపు
కూరుచుండి వియోగార్తిఁ ♦ గుందు వేళఁ
గొలఁకులందుండి ధారలై ♦ చలువ తాల
నంజనముఁ గూడి పడినట్టి ♦ యశ్రులివియె. 7

(మఱల భావించి) ఇది చంద్రకాంతము గాదు. ఇవి యశ్రుజలంబులుం గావు. విరిసిన తెలిమెట్ట దామరలపైఁ జేరిన తేఁటి ముత్తంబు లివి. కావున మఱియొకచో వెదకెదను. వెదకినమాత్ర మేమి ప్రయోజనము? ముహూర్తమాత్ర మేని తన వియోగము సహింపఁజాలని నా హృదయ మెఱింగియు నను విడనాడి యెచ్చటికో వెడలిపోయినది. (మఱల విచారించి) ఇట్లునుగాదు. పతినే దైవముగా భావించు నాపరమసాధ్వి యిట్టి యపరాధ మొనర్చియుండదు. ఇదిగో! కులట వసుంధర. సపత్నీ మాత్సర్యంబున నాసాధ్విని దిగమ్రింగినది. దీని శీల మిదివఱకే తెల్లమై యున్నది. ఏల యన,

గీ. రాజసభయందు దశరథ ♦ రాజతనయు
ననుఁగు నిల్లాలి నాతని ♦ కనుల యెదుట
నపహరించి తిరోధాన ♦ మందెఁ, గాన
నిచట దీనికి దుష్కరం బెద్ది యింక? 8

(స్మృతి నభినయించి) ఇది యనునంగాదు. అనేక సహస్రభూపాలుర ననుభవించి విడిచిన దీని కా పరమసాధ్విపై సపత్నీ మాత్సర్యమున కవకాశ మెద్ది? కావున నీపుడేమి మత్ప్రాణవల్లభ నపహరించి యుండ దని తలఁచెదను. కావున వేఱొకచో వెదకెదను. (పరిక్రమించి యెదుటంజూచి యానందముతో) ఆహా! యిది దేవి యొక్క మందారవతంసకము. మిత్రమా హారాశక్యా! దీనిని మఱలఁ బొందైచితి వేల! (తీసికొనఁబోవును)

అమా...మిత్రమా! నీవు మహారాజును సమీపించుట కిదియే సమయము. నేనునేదో యుపాయమున నీయన యున్మాదమును కించుక తగ్గించి పిమ్మట నగపడియెదను.

విదూ...(అట్లే సంక్రమించి మఱలఁ బ్రవేశించి శీఘ్రముగ రాజును సమీపించి కర్ణపూరముం జూపుచు) మిత్రమా! కర్ణపూర మిది. ఈమందభాగ్యుఁడను నేను. ఈపద్మరాగ భూమియందలి కిరణజాలంబులంజూచి భ్రమచే కర్ణపూర మను చున్నాఁడవు

(విదూషకుఁడు కర్ణపూర మిచ్చుచున్నాఁడు.)

రాజు—(తీసికొని హృదయముపైనిడికొని సరోమాంచముగా) ఓయీ! ప్రియా! పరిగ్రహాసుభగావతంసకా!

చ. పులకసుహృద్వతంసములఁ • బొందిదళాళికిస్పర్శవిఘ్నముల్
గలుగఁగఁజేయు దేనిపయిఁ • గల్గెనునీకుమహాభ్యసూయ యు
య్యలికులనీలనేత్ర సుమ • మాగ్రచయంబునఁ జిత్రమైన వ
త్స్మల నయనావిపాండుతర • గండతలంబునదుం బ్రమోదమే.

మిత్రమా! శరదంగసంగమోత్సవదుర్లలితం బగు నీకర్ణపూరంబుచే నామోహాంధకార మించుక విరళమైనది. కావున తదన్యమగు శ్లాఘాపాత్ర మగు మఱి యేవస్తువుచే నేనిప్పుడూరటఁ బొందుదును.?

విదూ—మిత్రమా! వియచ్చరయగు నామెకు సంబంధించిన వస్తువులు మనుష్యమాత్రుల మగు మనకెట్లు లభించును?

రాజు—(నింగివంకఁజూచి యానందముతో) ఆహా! నే నింతవఱకును సుకరంబుగ నూఱటఁబొందు మార్గమును మఱచితిని. చూడు మిదిగో! యాలతాంగి జనకుండగు భానుమాలి, దేవా! పద్మినీ వల్లభా!

సీ. స్వాతనయాచ్యుతరాగసం • గతినిఁ జేసి
మంజుళతఁ గాంచి నీకర • మాల యమృత

రసము లొలికించె నాదు గా ♦ త్రముల నిపుడు
కాన సమ్మృతాంశుఁడవు గాని ♦ ఖరకరుఁడవె ? 10

హా ! కష్టము. ఏమి యీయకాల జలదము ! ఈ పాపి భానుమాలి కడ్డుపడు చున్నాఁడు. ఓయి సౌదామనీమనోహరా!

చ. వెడద శిఖాళినుప్పొ నిజ♦పింఛములన్ విరియించినాట్యము
న్నడపుచుఁగూఁతమ్రోఁత గళ♦నాళమునిండగ మోరసాఁచి ప్రే
ముడినిఁజెలంగు బర్హివర♦ముం గనుమా! ప్రణయంబుమీఱఁగాఁ
దోడఁజొక్కుమింక సూతయున♦ద్యోతమణికిన్ విని రోధి వాటకున్

(నేపథ్యమున)

రాజా! ఋతునందనా!

మ. వర తేజోనిధి నీవు దూర మగుటం♦బాంచాలకుల్ నీదు రా
జ్యరమాస్థానము నాక్రమించి రిఁక నం♦త్యాంత త్వరం బోయి నీ
పుర మాపజ్జలధిస్వ♦భంగముల ని♦ర్మూలంబు గాకుండ భూ
వర! రక్షింపుమనంతరంబున భవ♦ద్వాంఛల్ ఫలించుంజుమీ

రాజు...(క్రోధారుణిత నేత్రుఁడై వినుచు) ఏమి? పాంచాలపశువులు నా రాజ్యమాక్రమించిరా?

ఉ. కాలుఁడ! యింతు వేని క్షణ♦ కాలముమత్త దనోద్వయంబు [బాం
చాలుర, పత్తిహస్తిరథ♦సైంధవ యుక్తముగా క్షణంబులో
వాలును బల్కదొట్టి శర ♦పంక్తుల వారలసంధిబాధముల్
రాలఁగఁగొట్టి పంపెద న♦రాతిగణంబుల నిడుప్రోలికిన్॥

విదూ...(తనలో) శబాస్! వసుమిత్రా శబాస్! అమాత్యభావానురూపముగఁ జరించితివి. భగవదనుగ్రహంబుచే నీతని మదనోన్మాదము రోషాంకుశ ప్రభావమున నివారితమైనది. కావున నేనుగూడ నీతనిరోషము

నించుక వృద్ధిఁ బొందించెదను. (ప్రకాశముగా) మిత్రమా! ఆపాంచాలాధములు నీబాహుబల పరాక్రమ మిదివఱకే యెఱింగి యుండియు నిపుడిట్లు దొడంగుటెల్ల నాత్మవినాశనంబునకే.

రాజు...(సవిమర్శముగా) మిత్రమా! పూజ్యుఁడగు వసుమిత్రుఁడు రాజ్యమున లేఁడా? ఇట్లేల సంభవించినది.

{ వసుమిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు. }

వసు...దేవా! జయ మగుఁ గాక!

రాజు...(చూచి) ఆహా! అమాత్యుఁడు వసుమిత్రుఁడు విచ్చేసి యున్నవాఁడు (కౌఁగిలించి) నెచ్చెలీ! మన రాజ్య మంతయుఁ బాంచాలురచే నాక్రమింపఁ బడెనని యాకాశవాణి వచించినది. నీమతిబలముచే వారి పరాక్రమ మంతయు నడుగంటి యుండెఁ గదా! మరల నిట్లేల సంభవించె?

అమా...దేవా! నిజము. కేవల మాపాంచాలాధముల పరాక్రమ మెంచఁ దగినదికాదు. కాని భవద్బాహుబలనిర్జితము లగు సకలరాజన్య చక్రంబులతోఁ గూడ తా మేకీభవించి నామతిబలము నయిత మతిక్రమించి, దేవరవారి పరాక్రమమున కెదురు నూచుచున్నారు. కావున నింక నిముసమైన నాలసింపక వారి మనోరథంబులం దీర్పుఁడు.

విదూ...అమాత్యా! అనుచరులను వాహనంబులనుగూడఁ దోడితెచ్చితివా? అట్లయిన శీఘ్రముగ బయలు వెడలుదము.

అమా...అవును తెచ్చితిని. ఇచ్చటికి క్రోశమాత్రప్రదేశమున వారల నిలిపి మహారాజుగారిని వెదకుచు నేనొక్కఁడనే యిట కేతెంచితిని.

రాజు...అనుచరసమూహంబు లేటికి? సకలరాజన్య ప్రాణాపహారియై నాదక్షిణ భుజము మిక్కిలి త్వరపడుచున్నది. కావున మన కంబర గమనోపాయ మాలోచింపుము.

{ అప్పుడాకాశమునుండి సారథి రథముతోఁ బ్రవేశించును. }

సారథి...సూర్యభగవానుఁడు నా కిట్లానతిచ్చెను. "హయసేనా! వాయల్లుఁడచట లేమిం జేసి జలపూరపూర్ణంబు లయ్యును నా రశ్మిజాలంబు లాతని రాజ్యమున వర్షింప నిచ్చగించుటలేదు. కావున నాతని రాజ్యము దుర్భిక్షపీడితంబై నశింపనున్నది. ఇఁక సంవరణుఁడన్ననో తపతీ సంగమ లోలుఁడై కర్తవ్యముల మఱచి నందనోద్యానతుల్యంబులగు నీ హిమవత్కాననంబుల సంచరించుచు స్వరాజ్యమున కేఁగుట కిచ్చగింపకున్నాఁడు. కావున నీదంపతుల నించుక కాలము వేఱుపఱచినఁ గాని కార్యములు నెఱవేఱవు. పతినే దైవముగ నెంచు నాతపతి జాగ్రదవస్థలో వియోగముమాట విన నోర్వదు. కావున వారిద్దఱు నిద్రావస్థలో నున్నపు డాతపతిని సపరివారముగా సావిత్రి సకాశమున జేర్పుము" పిదప నేనన్ననో

గీ. సహచరమునుండి యల చక్ర ♦ సతినివోలె
పృథుపయోధరభార గు ♦ ర్వియగు ప్రియను
నృపుని కెడజేసి రవియాన, ♦ నీచుఁడనయి
తొలుతవాడైతి జనులఁ బ్ర ♦ దోషగతిని

ఇఁక దేవుని రెండవ నియోగము. "అమాత్యునిచేఁ బ్రేరేపింపఁబడి సంవరణుఁడు నిజరాష్ట్రమున కేఁగదలఁచి శీఘ్రగమనోపాయము తెలియంగక చింతిల్లుతతని రథముం గొంపోయి యాతనిమనోరథంబుఁదీర్పు" మనియె కావున నిటక్రిందికి దిగియెదను. (అవతరణము నటించుచుఁ గ్రిందజూచి) ఆహా! యీరథము క్రమముగాఁ గ్రిందికిదిగుచుండఁగా

చ. జలమునఁదేలు నేలదళ ♦ సంతతిఁ గొండకుంజంబులం, గుజం
బులు జలమందు కాదు గిరి ♦ భూమి, గిరుల్ జలరాశిఁ, గాదు భూ

స్థలి, భువిసంద్రగా సెనము • సందున, మామకచిత్తవృత్తు లి
ప్పాలు పునఁ దోఁచె నెక్కొని స•ముద్ధరణప్రతిరోపణంబులన్

విదూ...(పైనిఁజూచి) మిత్రమా! నీహృదయసంతాపము నివారింపఁదలచి మీ
మామయగు సూర్యభగవానుఁడిటు కేతెంచుచున్నట్లున్నది.

రాజు...ఇదేదియో నొక దివ్యరథము. నిజప్రభాపటలంబులచే నాద్యంతంబుల
దోఁపనీయకున్నది.

అమా...దేవత లెల్లపుడును దేవరవారిమనోవర్తులేకదా?

సారథి...(క్రిందికి దృష్టులు నిగుడ్చి) ఆహా! యిదిగో మహారాజగు సంవరణుఁడీ
హిమవత్కాననంబున నున్నాఁడు. ఇపుడు నేనీతనికి భూతార్థమంతయు
నెఱింగించినచో తనదేవివృత్తాంతమతఁడు నన్నడుగును. అపుడు కష్టము
సంభవించును. కావున నిట్లువచింతునుగాక. (క్రిందికి దిగి సమీపించి)
మధ్యమలోకపాలా! విజయమగుఁగాక! అసురవిజయంబున మీరు పలు
మాఱు తనకు సాహాయ్యమొనర్చుటం జేసి మహేంద్రుఁడు మిగుల సంత
సించి యాయుష్మంతుఁడవగు నిన్ను హస్తిపురముం జేర్పుమని యీ
రథంబుతోఁగూడ నన్నిటకుఁబుత్తెంచెను. కావున నధిరోహింపుము.

రాజు...(సంతసముతో) భగవానుఁడగు మహేంద్రుఁడు నన్ననుగ్రహించుటం
జేసి మిగుల ధన్యుఁడనయితిని.

[అందఱు రథమునఁ గూర్చుందురు.]

అమా...ఓయీ సేనాపతీ సింహఘోషా! అనుచర సమూహంబులనెల్ల నిర్బా
ధకముగాఁ బురంబునకుం దోడితెమ్ము. వినుచున్నాఁడవు? అట్లే
యనియా?

సారథి...ఆయుష్మంతుఁడా! పగ్గముల సడలింతునా?

రాజు...మంచిది. తప్పక యట్లొనర్పుము.

(సారథి యట్లొనర్చును.)

విదూ—మిత్రమా! పూర్వము నిన్ను నేను ప్రార్థించిన యాకాశగమనము సంప్రాప్తమయ్యెఁగదాయని మిక్కిలి సంతసముగలుగుచున్నది. కాని యీ రథవేగముచేతఁ గనులుతిరిగి క్రిందపడుదునేమోయని మిక్కిలిభయమగుచున్నది. కావున నిన్నుగట్టిగాపట్టుకొని కూర్చుండెదను. (రాజును పట్టుకొనుచున్నాఁడు.)

రాజు—(రథవేగము నిరూపించి) ఆహా! యీరథవేగము వితర్కింప నలవిగాకున్నది. ఏలయన,

మ. కన నేకక్షణపూర్వపశ్చిమకలా ♦ కాలంబునం దీహరుల్
వనదాగ్రంబునఁబూర్వపశ్చిమఖుర ♦ ద్వంద్వంబులన్ నిల్పుఁబ్రాం
తనిబద్ధోజ్జ్వలఘుర్ఘరణోదితతడి ♦ త్సంఘంబు సూచించు నీ
ఘనవేగస్థిరమైనటుల్ దనరు చ ♦ క్రవ్రాతపుందోర్లికన్. 16

(అందరు నిష్క్రమింతురు)

పంచమాంకము

సంపూర్ణము.



ఓం

# తపతీసంవరణము.

## షష్ఠాంకము.

---

{ అంతటఁ గంచుకి ప్రవేశించుచున్నాడు. }

కంచు—(సవిమర్శముగా) రథహయహేషితంబులతోడనే ఘనాఘనహుంకారంబులా? పాదపద్మరాగంబులతోడనే భూమిపయిఁ బయోవృష్టులా! ఆహా! సంవరణమహారాజుగారి మహానుభావత యేమని చెప్పవచ్చును. కాని యీమహౌత్సుక్యముచేత నాయవయవములకు దౌర్బల్యము రెండుమడంగు లధికమైనది. ఏలయన

చ. నడ వొకరీతిగాదు, నయనంబు లమ్లఁదారలు సంభ్రమింపఁ, జొ
ప్పడును విషాదముల్ శ్రమముఁ భ్రాంతియు, నూరుబలంబు, వక్షు
గడఁ జలియించు గాత్రవల్లి కంచుకమై ప్రవరించు, నిట్టిసంభ్రముం
దడిసి జరాభరంబు నను నర్తకుభంగి నటింపఁ జేసెడిన్ 1

"వినయత్రాత! శీఘ్రముగఁబోయి కార్తికేయావాస పరిసరారామము నందలి వాపికకనతి వాసయోగ్య మగు గంగాలోక సౌధమును జక్కఁగ నలంకరించి రమ్ము" అని యేలిక నాకు మొదల నిడె. నా నియోగ మిప్పుడు నెరవేర్చికొంటిని. మహారాజుగారును దత్సౌధము నధిరోహించి యున్నారు. కావున నిఁక వేఱునియోగ మనుష్ఠింపఁ బోయెదను (అని నిష్క్రమించుచున్నాడు)

ఇది విష్కంభము.

{ అంతట రాజును విదూషకుండును ప్రవేశించుచున్నారు. }

రాజు — ఆహా! మంత్రులయొక్క మనోవ్యాపారములు నిసర్గనిష్ణాతమతుల కైన నెఱుంగరానివి గదా! ఆర్యుండు వసుమిత్రుండు

గీ. అరులు పాంచాలు రోసరించి • నట్టి భూరి
పరిభవము నాకు నైన దం • భమునఁ దెలిపి
నెపాన నెడబాపి తన పురం • బునకుఁ దెచ్చి
కొల్లలుగ రాజ్యమున వృష్టిఁ • గురియఁ జేసె. 2

ప్రాయికంబుగఁ బయోభర మేదురంబులగు ఘనసంపదలను గోవులం బితుకు చందమిదియ కదా?

విదూ — సకల భువనైక నాథుండవగు నిన్ను మేఘదోహనార్థమై దూడ గాఁగొని తెచ్చుటం జేసి యీ మంత్రి మూర్ధాగ్రేసరుండని నేను నిశ్చయముగా వచింపఁ గలను.

రాజు — పరిహాస మింకఁజాలును. ఇంతవఱకును పాంచాలుర యందలి కోపముచే వ్యాపారరహితమై యున్న ప్రియావియోగానలము నేఁ డడ్డులేక చెలరేఁగ నుంకించుచున్నది. విరహిజనుల కతిభయంకరమగు కాలము సంభవించినది. చూడు,

చ. ఉసురువనంపు మల్లెవిరు • లూడఁగఁ బాంథులు నేఁడునట్టి ప్రా
వృడనిల రాజి వీఁచె, నన • లెత్తుముదంబునఁ గంఠనాళముల్
నిడుపుగ సాఁచి చాతకవి • నీలకచల్ వడగండ్లఁ గ్రుక్కురిం
చెడితొలిధారలం బ్రియులఁ • జేరిసుఖంబుగఁ గ్రోలుచుండెడిన్

కావున నాకిపుడు శరణ మెద్ది?

{ అంతట మేనకారూపము ధరించి తపతి ప్రవేశించుచున్నది. }

తపతి — (సవిమర్శముగా నిట్టూర్పువిడిచి) సఖీరూపమున నార్య పుత్రుని

దర్శించి యూరటఁ బొందసెంచి నా సఖులనిద్దఱినిఁ గూడ వంచించి వచ్చితిని. ఇంత మాత్రమున జనకశాసనమతిక్రమించినట్లు కాదు గదా? కావున నార్యపుత్ర సందర్శనోత్సవ మనుభవించెదను. (పరిక్రమించి క్రిందికిఁ జూచియానందముతో) ఇదిగో ! ఆర్యపుత్రుఁడు వయస్యునిం గూడి ప్రాసాదాగ్రభాగమునఁ గూర్చొని యున్నాఁడు. కావున నిప్పుడిచ్చట దిగిరెదను. (దిగుచున్నది.)

విదూ—(చూచి)ఇదిగో! పూజ్యురాలగు తపతీదేవి విచ్చేసినది.

రాజు—ఎక్కడెక్కడ?

తప—(విషాదముతో) వీరు నన్నుఁ దెలిసికొనిరా యేమి ?

విదూ—ఇదిగో మాడు మేనకారూపమున నవతరించినది.

తప—(విషాదముతో) నిక్కముగ వీరు నన్నుదెలిసికొనిరి. తండ్రికన్నివిధముల నపరాధమొనర్చితిని.

రాజు—(చూచి) ఓహూ! సఖియగు మేనకవచ్చినది. మిత్రమా! యీమె నాప్రేయసియంటివే, యదేల?

విదూ—వీరిద్దఱొక్కడైకమత్యముతో నేకశరీరముభంగిఁ జరియించుటం జేసి యట్లంటిని.

తప—దైవానుగ్రహముచే నాకిపుడూరటగల్గెను. (సమీపించి) జయము మహారాజా!

రాజు—సఖీ స్వాగతము. (అని గాఢముగాఁ గౌఁగిలిఁచికొని స్పర్శము నిరూపించుచు నాత్మలో)

గీ. దేవిపరిరంభమునవోలె ♦ దేహమెల్ల
గగురుపాటొందె నూరకే ♦ కారణంబొ?
సతతసంశ్లేషమునదాని ♦ స్పర్శయింత
సంక్రమించెను యేమొ యీ ♦ చానయందు. 4

(ప్రకాశముగా) సఖీ మేనకా! మాప్రాణములకుఁగుశలమే కదా!

తపతి—మహారాజా! యిపుడు కుశలమే.

రాజు—ఇపు డనుచున్నావదేల?

తపతి—మహారాజా! చిత్తగింపుము. నాఁడు నెచ్చెలి దేవరవారిం గూడి తపన వనమందు నిదురించుచుండి పిదప మేల్కాంచుసరికి సావిత్రీసకాశమం దున్నట్లు తెలిసికొనెను. అచట దేవరవారిఁగానమింజేసి నెచ్చెలి మూర్ఛలో మునింగియుండ సావిత్రి లేవనెత్తి యూరడించి 'బిడ్డా! పరితపింపకుము. నీయందలి గాఢానురాగమున నీనాథుఁడు నినుఁ బాసి పోవమింజేసి యాతనిరాష్ట్రమున గొప్పక్షామము సంభవించినది. జనకుఁ డది యెఱింగి మీకిద్దఱకెడగలిగినఁగాని మహారాజు నిజనగరంబున కేఁగడని తలంచి సారథిచే నిన్నిటకుఁ దెప్పించెను. అంత విరహోన్మాదపరవశుఁడగు నీభర్త నిజపురంబునకేఁగెను. నీవిఁక జనకు ననుమతి లేనిదే నీనాథునిచెంత కేఁగరాదుసుమా!' యని చెప్పెను.

రాజు—(విదూషకునితో) మిత్రమా! అతఁడుగూడ సూర్యసారథిగా మారెను. (మేనకం జూచి) తరువాత,

తపతి—భర్తృవియోగజనితదుఃఖమున నెచ్చెలి గుండుటఁదొట్టి సర్వవృత్తాంతమును దేవరవారికి నివేదింపవచ్చుచుండి పయోవృష్టులు భూమిపైఁబడుటఁ దిలకించితిని. కావున నిఁక మీపరస్పరసంయోగమునకు స్వామియగు భానుమాలి యనుమతించునని తలఁచి "ఇప్పుడు కుశలమే" యంటిని.

విదూ—దేవి నపహరించికొనిపోయిన దొంగలు బయలువడిరి.

రాజు—(నిట్టూర్పువిడిచి) ఇపుడు నాసందియము నశించినది. సఖీ మేనకా! నేనిఁక క్షణమైనప్రియావియోగము సహింపఁజాలను. కావున భగవానుఁడగు సూర్యు నంగీకరింపఁజేసి దేవినిటకుఁదోడ్కొనిరమ్ము.

తప—(రాజును జక్కఁగాఁదిలకించుచు) మహారాజా! భవద్దర్శనసుఖ మించుక యనుభవించిపోయెదను.

రాజు—(సవితర్కముగాఁదనలో)

చ. పరులకుదూతికల్ దెలుపు ♦ వార్తసఖిప్రణయానుహూపమై
కరము రసప్రధానముగఁ ♦ గ్రాలుట నైజముగాని యీనిరం

తరరతిరాగసన్మరస • ధారలఁ జిమ్మెడి దీపికం గాం
బరుదయి యెన్నఁడేనిఁ [illegible] సకృత్తి చిత్రముఁ దోఁపఁ జేసెడిన్. 5

(ప్రకాశముగా) నీముఖము మాత్రమే చూచికొనుము. నామానసము మిక్కిలి తమకమొందుచు నీగమనమును ద్వారపెట్టుచున్నది.

తప—(మేఘగర్జనము విని ప్రస్తుతము మఱచి) అయ్యో! భయమగుచున్నది. ఆర్యపుత్రా! నన్ను గాఢముగఁ గౌఁగిలింపుము.

రాజు—(క్రోధముతో) ఛీ! పాపి! అనాగరతరుంజొచ్చితివా? అభిమతకాంతా గుణనిబద్ధహృదయుండగు నీ జనుండు నీవనుకొనినట్లు నైచ్యమునకుం జొచ్చువాఁడు కాఁడు.

తపతి—(రోషముతో) సరే! నీకనురూపయగు దేవిం గూడి స్వేచ్ఛగా విహరింపుము. అనుచితమగు చోట నెయ్య మొనర్చినందులకుఁ దగిన ప్రాయశ్చిత్త మొనర్చికొనియెదను. (అని నిష్క్రమించును)

విదూ—మిత్రమా! ఇదేమి రాక్షసిగా నున్నదే! ఇది నిజముగా మేనక యైనచో స్వప్నమందైన నిట్లొనర్పదు.

రాజు—స్త్రీస్వభావ మిట్టిదే చూడు,

మ. పరమంశో[illegible] బంధుసంత[illegible] [illegible] నా[illegible]మొకర్షను
స్థిరమైత్రిన్ గు[illegible] [illegible]కే భామినుల్
తిరుగం జూ[illegible] [illegible]ములాం • [illegible] సూత్రమై
వఱలం గాని మహత్త్వభాగినమనం • బోరింప రా[illegible]దెన్

నిష్కళంకమానసయగు నాపరమసాధ్వి యజ్ఞానముచే నీరంకులాడి నిటకుఁ బుత్తెంచినది. మనోవినోదార్థమై నియమింపఁబడిన యది యిట్లు మారినది. పోనిమ్మి కేల? కర్ణపూరముం గొనిరమ్ము.

విదూ—చిత్తమట్లే (నిష్క్రమించును.)

{ అంతట రంభారూపధారిణియైన రాక్షసి ప్రవేశించుచున్నది. }

రాక్షసి — పూర్వము హిమవత్సానువందే నొనర్చిన మాయలన్నియు భృగుకర్మ ప్రభావమున నిష్ఫలము లయ్యెను. ఈతని కులక్షయమొనర్చుట కిదియే తరుణము.

(సమీపించి రాజుపాదములపైఁ దభాలునఁ బడును.)

రాజు — (సంభ్రమముతో లేవనెత్తి) సఖీ! యిదేమి? నామానసముఁ గలఁచుచున్నావు? నీవిషాదమునకుం గారణ మేమి?

రాక్షసి — (బాష్పములు గార్చుచు గద్గదస్వరముతో) నెచ్చెలియగు తపతి జనకుని చండశాసనమునకు లోఁబడి భర్తృసంగసౌఖ్యము లభింపమిం జేసి వియోగానలము సహింపఁజాలక తన్నుఁ దానే... యింకమీఁద నే వచింపఁజాలను. నేను గూడ నాత్మహత్యచేఁ గాయమును బాసెదను. (నిష్క్రమించును.)

రాజు — (మూర్ఛనొంది కొంతవడికిం దెలిసి) హా! రవికరోత్సంగలాలితా! అజ్ఞాకరుండనగు నన్ను విడనాడి యెటు కేఁగితివి? దేవా! కృతాంతా!

గీ. [illegible]
[illegible] నైన [illegible]
[illegible]
[illegible] 7

ఏమిది! నే నింకను ప్రాణలోభుఁడనై కేవలము గన్నీరు గార్చుచున్నాఁడను. ఇఁకఁ బ్రాయోపవేశమున కుపక్రమించెదను. (సౌధముఁ దిగుట నభినయించి పరిక్రమించుచు) ఈ స్ఫటిక సోపానమార్గమున రేవులోనికిం దిగి గంగాజలంబు లాడి ప్రస్తుత కార్యమున కుపక్రమించెదను. (స్నాన మభినయించును.)

{ అప్పుడు గంగాజలంబులం దడిసి తపతి ప్రవేశించు చున్నది. }

తప—సఖీ! మందాకినీ! ఆర్యపుత్రు మరణవార్తవిని విపత్తున కెదురయి యున్నదానను. ఇపుడు నాకంతభార మేల తొలఁగించెదవు? ఇఁక శీఘ్రముగఁ బ్రాణముల విఘటింపఁ జేసి నన్ను మృతుఁడగు నార్యపుత్రునితోఁ జేర్పుము.

రాజు—(ధ్వనివచ్చు వైపునకుం జూచి)

గీ. కమలపరిశోభితయు ఘన ♦ కలుషయుతయు
శఫరనేత్రియు నయి యాత్మ ♦ సదృశరూప
మున వెలుంగు నొకానొక ♦ ముదిత నిపుడు
తాల్చి యున్నది జహ్ను సు ♦ తాస్రవంతి. 8

ఇఁక వితర్కించినఁ గార్యము దప్పును. ముందీమె ప్రాణములు విడువ నున్నది. కావునఁ బట్టి నివారించెదను. (అని పట్టుకొనును.)

తప—[రోషముతో] ఎవఁడిది? నాహస్తము పట్టుకొని కళంక మొందవించు చున్నాఁడు.

రాజు—[నిగూహించి] అహా! ఇదేమి? దేవిగానున్నదే! భగవతీ! భాగీరథీ! యిది నాకు మహానుగ్రహము. మరణోద్యుక్తుండనై నేనిటకు వచ్చి యుండఁ బ్రాణములు నిల్పి నన్ను రక్షించితివి. ప్రియా! శంకింపకుము. నీ వెవని వియోగము సహింపఁజాలక మరణమున కుపక్రమించితివో యా ఘోరపాతకి సంవరణుఁడు వీఁడె.

తప—అహా ఆర్యపుత్రుఁడా! జయమార్యపుత్రా! (గాఢముగఁ గౌఁగిలించుకొని) నాథా! యిది స్వప్నవృత్తాంతము కాదుగదా.

రాజు—నాకు నదియు సందియము. కానిమ్ము గట్టున కేఁగి విచారింతము.

తప—(వడఁకుచు) ఆర్యపుత్రా! నాయంగములు వడఁకుచున్నవి. కావున గాఢముగఁ బట్టుకొని నడువుము.

రాజు—(అట్లే చేసి పరిక్రమించుచున్నాడు.)

(నేపథ్యమున)

సఖీ మేనకా! మహారాజుగారిని, నెచ్చెలినిం బాసి నిముసమైన నే నీ శరీరము ధరింపంజాలను. కావున నాకంతయునం బాశమర్పింపుము.

(మఱల నేపథ్యమున)

సఖీ! రంభా! నేను నీ మరణమును గూడ జూచి యింకను సహింపం జాలను. కావున నేనే ముందు మరణించెదను.

తప—కష్టా! సఖులంత మొందుచున్నారుగదా! ఆర్య పుత్రా! త్వరపడుము త్వరపడుము.

రాజు—(సంభ్రమముతో సమీపించి) పూజ్యులగు మీరు సాహస మొనర్ప కుండు. మే మిదిగో జీవించియున్నారము.

(నిష్క్రమించి రంభామేనకలతో మఱలం బ్రవేశించును.)

రాజు...ప్రియా! నీసఖులం జూచికొనుము. కుశలముగ నున్నారు.

తప—సఖులారా! నన్ను గాఢముగం గౌఁగిలింపుడు.

(కన్నీరు విడుచుచు నొకరి నొకరు గౌఁగిలింతురు.)

రాజు—ప్రేయసీ! భవత్పాదచిహ్నిత మగు నీమరకతశిలాతలమందొక ముహూర్తమాత్రము విశ్రమించిపోవుదము

తప—మనోహరా! యట్లే జేయుదము (అందఱుం గూర్చుండురు.)

రాజు—ప్రియా! నీవు భాగీరథినింగాయము విడువ నుంకించుటకుంగారణ మెద్ది?

తప—ఆర్యపుత్రా! చిత్తగింపుడు. సఖి యగు మేనకారూపమున నేను దేవర వారిచెంత కేతెంచి యనురాగాంధకారమునం బ్రస్తుతము మఱచి భవత్పరిష్వంగ సుఖంబుం గోరి మీచేం దిరస్కరింపం బడితిని.

మేన—(లజ్జారోషములతో) నన్ను మిక్కిలి పరిభవించుచు, సఖీ! ప్రణయ మిట్లు వెల్లడించితివి, బాగు.

రాజు—(తలయూఁచి)ఓహో యిట్లు జరిగినదా ! తరువాత,

తప—పిమ్మట నేను మరణమున కుపక్రమించి దైవవశమున నెట్లో సఖీరూపధారిణినై యుంటఁ దెలిసికొని పశ్చాత్తాపంబునఁ బొక్కుచుంటిని. అపుడు రంభ కన్నీరుమున్నీరై కారుచుండ నాకడకేతెంచి దేవరంగూర్చి యమంగళముఁ దెలిపెను. అందుచే నేను మరణమున కుపక్రమించితిని.

రంభ—(విషాదముతో) ఆరంభ యెవ్వతె ?

తపతి—నీవు గాదా ?

రంభ—కట్టా ! నేనచ్చోటికి వచ్చియైన యుండలేదే! అట్టిఘోరకృత్య మెట్లొనర్చియుందును ?

రాజు—అదెట్లు ? నాకడ దేవిపై నమంగళమారోపించినదియు నీవే కదా !

రంభ—(భయముతో వక్షమునఁ జే యిడుకొని) అయ్యో ! యిఁక నెట్లు! (అని మేనకం జూచుచున్నది.)

మేన—మహారాజా ! మీరుపొరపడితిరి. మే మిరువురమును నెచ్చెలిని వెదకుచు వచ్చుచుండ జాంబూనదిక యేడ్చుచు మా కెదురై నెచ్చెలి విపత్తును, దేవరవారి ప్రాయోపవేశమును గూర్చి మా కెఱింగించెను. పిమ్మట మేము మహాదుఃఖమున మరణమున కుపక్రమించుచుండ తమరరుదెంచి మమ్ము బ్రదికించితిరి.

తప—(సాధ్వసముగా) ఆహా! ఆర్యపుత్రుండును నిట్టి సాహస మొనర్చెనా? మఱల జాంబూనదిక రాకున్నదే. యేల ?

రాజు—

గీ. తెఱనవనమునఁ దొలుత నే ♦ దానవి ననుఁ
గినుక వంచించె నట్టి మో ♦ హినికనల్పు
మాయయో యేమొ [illegible] ♦ మ్మాంగ నాఁడు
చకితసారంగశాబకే ♦ చారునేత్ర !

తప — (స్మృతినభినయించి శోకముతో) ఇపుడు నేనార్యపుత్రుకడఁ జేరుటం జేసి గురునియోగ మతిక్రమించిన దాననైతిని. ఆర్యపుత్రా! నన్నిఁకన్ విసర్జింపుము.

రాజు — ఆకాలమున నీ పిడుగు పాటేమి? (అని విషణ్ణుఁడగును)

సఖులు — చెచ్చెలీ! విషాద మొందకుము. మేము భగవాను ననుజ్ఞ దెచ్చితిమి. ఇదిమొదలు నీసహచరునిఁ గూడి విహరింపవచ్చునని దేవుఁ డాజ్ఞ నొసంగెను. మఱియు విప్రవాస నాటకము లగు నీవసనంబులు మీకుఁ బుత్తెంచె. కావునఁ బరిగ్రహింపుఁడు.

(పరిగ్రహింతురు.)

తప — (ఆనందముతో) జనకానుగ్రహమునఁ బ్రదికితిని.

రాజు — (హర్షముతో) మీవచనామృతమున సుఖించితిమి.

మేనక — (స్మృతి నటించి భయముతో) సఖీ! జాంబూనదికారూపధారిణియై యారాక్షసి గురులకుఁ గూడ నెద్దియో కీడు రోయుచున్నది. కావున మనమేఁగి యధార్థ మెఱింగించి వత్తము రమ్ము.

(అని నిష్క్రమించుచున్నారు.)

నేపథ్యమున

ఓహో! తొలఁగుఁడు తొలఁగుఁడు. దావాగ్ని ప్రవిదీప్యమానమగు నంజన శైల శిఖరము క్రిందఁ బడుచున్నది.

తప — (భయముతో) ఆర్యపుత్రా! రక్షింపుము రక్షింపుము. (రాజును గౌఁగిలించికొనును.)

రాజు — భీరురాలా! భయ మొందకుము. ఇది నిశ్చయముగా పారాశర్యుని భ్రమముగాని మఱొండు గాదు.

{ కర్ణపూరము పట్టుకొని విదూషకుఁడు
భయముతోఁ బ్రవేశించుచున్నాఁడు }

విదూ — (మరల నదే చదువును.)

{ అంతట శరపంజరనిబద్ధయగు రాక్షసి ప్రవేశించుచున్నది. }

రాక్ష—(రాజుం జూచి) రక్షింపుము రక్షింపుము. మహారాజా! (రాజు పాదములం బడును.)

విదూ—ముందీయగ్నిముఖమునుండి నన్ను రక్షింపుము. (అని రాజువెనుక డాఁగుచున్నాఁడు.)

తప—ఆర్యపుత్రా! నాయంగములు వడఁకుచున్నవి. ముందీరాక్షసిని వదలి వేయుఁడు.

రాజు—ప్రియా! భీతిల్లకుము. నే నుండలేదా! (రాక్షసింజూచి) నీ వెవరవు? నీదుఃఖమునకుఁ గారణ మేమి?

రాక్ష—(తనలో) ఈయన సత్యప్రియుఁడు. కావున నిజమునే వచించి తప్పించుకొందును గాక. (ప్రకాశముగా) చిత్తగింపుఁడు. మహారాజా! దేవరవారిచే నూర్గురు పుత్రులం గోల్పోయినదానను. మోహినికయను రాక్షసిని. నాఁడాయరణ్యమున నామాయలన్నియు ఋషిప్రభావంబున భగ్నము లగుటం జేసి యిచ్చట కరుదెంచి రంభాజాంబూనదికల వేషంబులతో మిమ్మును, మీకళత్రంబును, సఖీజనంబును మరణవ్యవసాయులం జేసి సూర్యలోకమున కేఁగుచుంటిని. అపుడు మార్గమధ్యంబున వసిష్ఠునిం గూడి భవత్తనయుఁడెదురయ్యె. అంత నాతని దిన నుంకింప నాకుమారుఁ డాకాశయాన నిరోధకరములగు బాణంబులచే నన్నీస్థితికిం దెచ్చెను. కావున మహారాజుగారు నన్ను మన్నింతురుగాక.

విదూ—మిత్రమా! యీరాక్షసి మన కేమపకార మొనర్చినది?

రాజు—(విదూషకుని చెవిలో) ఇట్లు

విదూ—ఆహా! పరమాద్భుతము. (రాక్షసిం జూచి) ఇంతయుపకార మొనర్చిన నిన్నురక్షింపకుండు టెట్లు?

తప—అనపత్యనగు నాకు తనయుఁడేడ? ఆయిన నార్యపుత్త్రుఁడు బహు
భార్యాపరిగ్రాహుఁడు గదా!

రాజు—(నవ్వుచు) ఇదంతయు సరియ కాని నాకుఁ దనయు డెవఁడు?

{ అంతట వసిష్ఠుఁడునుఁ జాపహస్తుఁ
డగుకుమారుఁడును బ్రవేసింతురు. }

—

మ. సరసీజాక్షునిఁ బాలసంద్రమునఁ బ్రస ♦ ష్టున్ సత్యలోకంబునన్
గిరిజేశున్ రజతాద్రియందుమఘవున్ ♦ గీర్వాణలోకంబునం
ధరణిం బైనిఁ బ్రసన్నుఁ జేసి రవికిం ♦ దౌహిత్రుఁ డౌనితనిన్
గురులం జేర్చఁగఁ బౌరవీయ పురికిం ♦ దోతెంచితే నిప్పుడే.

కుమా...(కౌతుకముతో)

చ. ఇపుడుమదీయగాత్రముల ♦ కెట్టిసుఖంబులభింపనుండె నా
దుపితలపాదపద్మముల ♦ ధూళి కతమ్మునఁ జేసి, యట్టియీ
విపులసుఖంబుమున్ను తొలి! వేల్పుదళమ్ములఁగూల్చుటన్ సురల్
గృపనుబ్రసూనవృష్టిఁగురియించిననాఁడును దోపకుండెడిన్.

(ఇద్దఱును బరిక్రమింతురు)

విదూ—(స్మృతి నటించి) రాకుసీసంభ్రమమున నే నింతదాఁక నీకర్ణపూరము
మాట మఱచితిని.

రాజు—(నవ్వుచు) ఇది యనవసరమందుఁ గానవచ్చినది. ఓహో ! ఔనిదియే
ముఖ్యావసరము. ఏలయన (తపతిం జూచి)

కం. పరిరంభమాత్రఁ బులకల్
వఱపుచు లాలిత్యసార ♦ భమ్ముల నీతో
సరియగునీయవతంసము
తిరిగి భవచ్ఛ్రుతితలమునఁ ♦ దిర మగుఁగాతన్.

రాక్షసి—మహారాజా! దీనురాలనగు నీరాక్షసిని వదలివేయుఁడు.

రాజు—సరే కానిమ్ము. (అని యస్త్రబంధము విప్పును.)

రాక్ష—రాజా! చిరకాలము వర్ధిల్లుము. (అని నిష్క్రమించును.)

వసి—(క్రిందఁజూచి) వత్సా! వీరె నీతలిదండ్రులు. కావున నిచ్చటదిగుదము.

(దిగుచున్నారు)

రాజు—ఓహో! గురుజనులు విచ్చేసియున్నారు. (సమీపించి) భగవానుడా నమస్కరించుచున్నాఁడను.

తపతి—మహానుభావా? నమస్కరించుచున్నాను.

వసి—(ఇద్దఱంజూచి)

మ. ఉపమాతీతరసానుభావములచే ♦ నుత్కృష్టమై సంధిచే
నిపుణంబైనుకణోత్తమాంగచయ సం♦దీప్తంబునై గాఢిలునీ
తపతీసంవరణంబు భూమిపమణీ ♦ సాంద్రప్రభాధిక్యతన్
విపులానందముఁ గూర్చుఁగాత ప్రజకున్ ♦ బెక్కేండ్లు కాలంబొగిన్

వత్సా! తల్లిదండ్రులకు వందనము సమర్పింపుము.

కుమారుఁడు—(సప్రణామముగా.)

గీ. తపతికిని సంవరణునకుఁ ♦ దనయుఁడైన
యీకురుండను వినయభర ♦ హృదయుఁడగుచుఁ
బితృజనముల పాదార ♦ విందములకు
మూర్ధమును వంచి యిదియె తా ♦ మ్రొక్కు నిపుడు.

రాజు—(సస్పృహంజూచి) వత్సా! నీవెవఁడ వైనను సరే. చక్రవర్తివిగమ్ము.

తపతి—(హర్షముతో) వత్సా! నాప్రేమమాత్రము నిన్నెఱుంగును. కాని నే నెఱుంగను. దీర్ఘాయుష్మంతుఁడవుగమ్ము.

విదూ—నాకించుకయేని సందియముగలుగుటలేదు. మీప్రతిబింబ మద్దమున నుంచినట్లేయున్నది.

వసి—వితర్కమేటికి? యీతనిచరిత్రము వినుఁడు.

రాజు—(సాదరముగా) అట్లే సెలవిండు వినుచున్నాఁడను.

వసి—పూర్వము తపనవనమం దీమె గర్భము ధరించినపిదప నాత్మప్రభావముచే నీకుమారుంగనియె.

రాజు—తరువాత,

వసి—సురల కజేయులగు నసురుల నీతనిచే నిర్జింపఁజేయుటకును, దేవాహారంబులచే నీకనిశరీర తేజోబలంబుల వృద్ధిబొందించుటకును, రంభ మార్తాండశాసనమునఁ బుత్రవియోగము మీకెఱుకపడకుండునట్లు ప్రసవసమయమున నే తపతికి స్మృతిఁ దప్పించి యితనిని సావిత్రీసకాశమునకుం గొనిపోయెను. అందువలన దపతికి పుత్రజననము స్వప్నమువలె దోఁచెను.

రాజు—తరువాత,

వసి—పిమ్మట కతిపయదినములకు సురేంద్రుఁడసురవిజయార్థమై బలిష్ఠకాయుఁడగునీతనిం బ్రార్థించెను. అపుడు మాతామహుండగు మార్తాండుఁ డీతనిం గని "కురుసురకార్యం" అనియాదేశించె. అందుచే నితఁడు కురుఁడయ్యెను.

రాజు—తరువాత,

వసి—పిదప సురకార్యము నివర్తించి వచ్చి తనయొద్దనున్న యీతని నిపుడు లోకబాంధవుఁడు నాతోఁగూడ నిటకుం బుత్తెంచె.

రాజు—(బాష్పగద్గదముగా) వత్సా! యిటు రమ్మ. (మూర్థమాఘ్రాణించి తొడపైఁ గూర్చుండ బెట్టుకొనుచున్నాఁడు)

తప—ఆర్యపుత్రా! యేమి నీకు క్షింభరిక్షము!

{ అని రాజు తొడనుండి కుమారునిబలాత్కారముగ లాఁగికొని కౌఁగిలించి స్తన్య మిశ్రములగు నానందబాష్పములచే నాతనిం దడుపుచున్నది. }

రాజు—(విదూషకునిఁ జూపుచు) వత్సా! గురునికి నమస్కరింపుము.

విదూ—(హాసపూర్వమున వడఁకుచేతులతోఁ గౌఁగిలించి) వత్సా! మంగళమగుఁగాక (ఆకాశమువంకఁజూచి) ఉత్పలికా! నీ వేల వచ్చితివి? ఏమనుచున్నావు? పుత్రసంయుతుఁడగు మహారాజుగారిని సంభావించుటకుఁ దేవి

యగుసాల్వరాజపుత్రి నిన్నుఁబంపిన దనియా ? మంచిది నీవు పొము
ఈకుమారుఁడా మెను నమస్కరింప వచ్చు చున్నాఁడు.

వసి—నీకుఁ బ్రియకార్యమిం కెద్ది యైన నున్నచో వాక్రువ్వుము. దా
నే నొడఁ గూర్చెదను.

రాజు—

చ. జలజహితాత్మజన్ జనుని సన్నిధినుండి మరల్చి తెచ్చి, వ
త్కులకరుఁడైనపుత్రునొడఁ గూరిచె దైవము నాకుఁ బ్రేముడిఁ
గొలిపె మదీయరాజ్యమునఁ గోరినవృష్టుల గోత్రరియు
వలసిన దెద్ది యింక? మిముఁ బ్రార్థన సేయ మునీంద్రసత్తమా

అయిన నీమేలు గలుగుఁ గాత.

చ. జగతిఁ బరస్పరంబు స్థిరసౌహృదముల్ విలసిల్లు, సత్కవుల
మిగులఁ బ్రసిద్ధిగాంత్రు, బుధమిత్రులు మత్సరముం ద్యజింత్రు, త
చ్ఛగృహాపరత్వజాత కలుషమ్ముల జార్చుచు నిందిరేశు పై
దగిలి మదీయభక్తి యుచితక్రియ వర్ధిలి పొక యొంసుతన్

(అందరు నిష్క్రమింతురు.)

షష్ఠాంకము-సంపూర్ణము.

---

# తపతీసంవరణనాటకము

సంపూర్ణము.

